# కర్ణధారి



" యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతిర్మతిర్మమ "



" నాటక కళానిధి "

డా॥ శుకుమారు సత్యనారాయణరావు.



శ్రీ వేణుగోపాలస్వామివారు

(నెమలి)



కీ|| శే|| వనమా కనకయ్య గారు

( ముద్రణ సహకారులు, వనమా వెంకటేశ్వర్లు గారి తండ్రి )

# శ్రీ వేణుగోపాల కృష్ణభగవానులకు

# కర్ణధారి - అంకితము



ఏలాయింత బిగింపుచేసెదవు తండ్రీ! లేచిరావయ్య; నే
నేలోపంబును సేయబోవనులె- నీ యిష్టంబె సాగింపగా
చాలింతుః సకలార్థ సాధక వృథాసంకల్పముల్ నేటితో
ఆలోచింపక లేచిరమ్ము కృతివేళాయెః యశోదాత్మజా!

కలువసుందరులు వెన్నెలవేడి తాపముల్
తీరి గంధాలతో చేరుకొనిరి
అరవిందములకొ్రొత్త యత్తరుల్ గొనివచ్చి
పవనుండు విడిసె చప్పరములందు
గొజ్జంగిభామ, సంకుముదకల్పము తేర్చి
కలశాలతో నిరీక్షణము సేయు
అదనులో నవమృగీమద పంకమందింప
అప్సరాంగనలె తయారుపడిరి

చాలుకట్టెను నెమలి పింఛాల తెరలు
పొగరుగిత్తలు, గోవత్సములును కదలి
మూగ ప్రేమను కాటుక సోగకనుల
చిలికె హర్షాశ్రువుల నభిషేకమనగ!

మిన్నేటిజవరాలి దొన్నెదోయిళ్ళలో
పాదముల్ కడుగు గొప్పలకు మరగి
పద్మావతీదేవి పచ్చల మొలనూలు
గజ్జెలపాటకు కాంక్షప్రబలి

పాలసంద్రపు తరంగాల ఉయ్యాలయూపు
కలలోని చిరుతనవ్వులకె మురిసి
సౌదామినీనాట్య సల్లాపగోష్ఠికై
శ్యామల జలద వేషములు మార్చి
మాయబుచ్చకు— కృతికన్నె మరచిపోకు
సృష్టియంతయు నీమాట యెత్తినప్పుడు
పోకిరీవాడవని ఆడిపోసుకొందు
రసలె— కలియుగమాయె కృష్ణయ్య ఇపుడు—

గోవులకాళ్ళధూళి కనుగొంటిన— కమ్మని గుమ్మపాలకై
క్రేవలకడ్డమై ఎగిరి, లేగలు వచ్చెడు యేటిడొంకలన్
తీవలచాటుగా నొదిగి తేలుచు— నీ మధురాధరామృత
శ్రీ వెలయించు రమ్యమురళీధ్వని విన్నటులుండురా ప్రభూ ! !

విననట్టులె వినుచుండియు
కననట్టులె కనుచు నీవు కనుకట్టులతో
తనియింప వచ్చునటవే
జనముల మనములను విశ్వజనకుడ వయ్యున్.

కనిపించిన కాడనుచును
కనిపింపకయున్న లేడుగా యని అనుచున్
తనుబలము — ధనము — చలమున్
తానేయని — తనువు విడిచి తరలెద రిటులే.

నిజానికి—

ఇంటింట దీపాల నెవరు పెట్టేరయ్యా
ప్రేమతో నీవు కన్నెట్టకున్న
మేఘాలకేమి ఆమెత లిచ్చుకొన్నాము
కోటిపంటల కెచ్చు కురిసిపోవ

మట్టికే సకలసంపదలిచ్చు గుణమిచ్చి
అందింపగా బేరమాడి రెవరు
చల్లని వెన్నెల చాందినీలనుచేర్చి
జననివై జోకొట్టుటనగ యేమొ ?

ఏమొ - యెవ్వరోగాని గ్రహింపగలరె - ?
ఎవరు గ్రహియించిన - అనుగ్రహింపగలరె - ?
కలడో లేడో యటంచును కశ్మలమున
కూరుకొని తేరుకొనలేని నారె కాని.

లేనిదంతయు ఉన్నట్లుగా నమర్చి
ఉన్నవాడవు లేనట్టు లొదిగిపోయి
తోలుబొమ్మలలోన ప్రాణాలు పోసి
ఆటలాడింపకున్న ఏమాయె కృష్ణ !

"నాదిది - నాది - నేన" ని జనంబులు గుండెలు బాదుకొందు రీ
ఆది యెరుంగలేక - కడియాలు కదల్చుచు పండితుల్ సహా
వాదన సేయవచ్చెదరు పాపము ! గోపకులాంగనా కుచా
పాదిత గంధపంకిల నిబంధిత బంధుడవం చెరుంగక.

సకలలోకైక బంధమోక్షణవిధాత
గొల్లపడుచుల కొసలు గొన్నవాడె - ?
నిత్యగోవిందనామ, సందేశ, రూప -
నఖ శిఖాగ్ర పర్యంతరాంతర్విలగ్న
దుల్లసిత పల్లవులు వారు - గొల్లవారె - ? ?

దళిత పాపౌఘుడగు పరంధాముడైన
శ్యామసుందరు డేడ - ? భార్యాసుతాది
బంధువ్యామోహ మేడ -? నిస్సంగదియముగ
భక్తజనులకె నిజమైన బంధువతడు.

తనభార్యయనక సత్యాదేవినే పట్టి
తాడించెను తరాజుదండెనెత్తి
మేనమామనె చెవుల్ మెలబెట్టి పడవైచి
గుండెలు పగులగా గుద్ది చంపె
బావగా మోమోటపడక, చైద్యుని తల
చక్రిఘాతమ్మున వ్రక్కలించె
విదురుని ఆకులో విందు సేవింపగా
రారాజునైన తిరస్కరించె

బాలగోపాలవేష సౌభాగ్యమెల్ల.
నెమలి పింఛమ్ములోనుండు నెపమొ — లేక
నెమలిపురవాసులందరి నెనరో, కాక
తానుగా వచ్చునే పరంధాము డిటకు — ? ?

ఈగాలి వీచునా — ఇతని కన్నుల తుదల్
కదలక ఒక తరంగమ్ముకూడ
ఈ మహాంభోరాసు లేకమైపోవలే
ఈ దయామయుడు శాసింపకున్న
ఈ సూర్యగోళమ్మె ఎగసి భుగభుగమండు
ఈ ఛండశాసనుం డేలకున్న
ఈ భూమి బ్రద్దలై క్రుంగి కూలకయున్నె
అధిపతియై స్వామి ఆజ్ఞయిడక

ఆ దయాశాంత నిత్య సత్యప్రభుండు
స్వామి చల్లగ మురళీ ప్రసార మొలసి
మనదు సంసార కల్లోలమును నడంప
చిన్ని కృష్ణమ్మగారు వేంచేసినారు.

అంత దయకంత శక్తికి — అంత ప్రేమ
కంతబ్రతు కంత కెక్కువైనంత కృతిని

అంతమేలేని యట్టి దేవాధిదేవు
నంఘ్రిసీమల కిత్తు కృష్ణార్పణముగ.

ఈ యశాశ్వతమైనట్టి పృథ్విలోన
స్వామియును— సత్కృతియు రెండె శాశ్వతములు
షోడశోపచారార్థమై — షోడశములు
పద్యములుపల్కి ; సత్కవిపద విధాన !
ఏను నీ సేవయొకటె యర్థింతు కృష్ణ !

మా పితరుల్, పితామహులు - మాతృహితాహిత బంధుసంతతుల్
శ్రీపతి కర్ణధారి కరుణించెడు వేళకు — పుణ్యలోక సం
ప్రాపిత నవ్య తేజులయి ప్రాకృతు నన్ను క్షమింతురిగాక, బం
ధీకృతపాపుడైన నను దీవనలిచ్చి తరింపజేయుచున్.

7—6—57 ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

"కర్ణబారి" ముద్రణకు ధనసహాయం చేసిన ఉపాయులు

# శ్రీ వనమా వెంకటేశ్వరులుగారి

## వంశ వర్ణనము



గీ. ఆర్యవైశ్య కులోద్భవులందు వినుతి
గన్నవారున్న వారును కలరుగాని
భక్తి వనమాలిపై నున్నవారు గలరె?
నెమలి వనమవారికి సరినెగడువారు.

గీ. శేషయాఖ్యుని పుత్రు లశేషగుణ వి
భాజితులు, వేంకటప్పయ — రామకోట
య్యార్యులన కల్గి తలిదండ్రులాదరింప
వనమ బృందావనమయును వాసిగనిరి.

చ. తనవలె వంశజుల్ మిగుల ధన్యులు మాన్యులుగా చరించుచున్
ధనము జనంబు పెంపెసగ, ధర్మము – నర్థము – కామమోక్షముల్
పెనగొన వేంకటప్పయయె ప్రీతిగ సర్వమొసంగె – కర్తయై
దనరిన తాతయో! తమ విధాతయెయంచు స్తుతింప బందుగుల్.

గీ. వేంకటప్పయ, సుబ్బమ ప్రేమఫలము
లైరి కనకయ్య, సీతయ్య యనెడు పుత్రు
లెవరిజోలికిపోని యమృతపు చినుకు
లాకరి కొక రీడుజోడులై యొదిగినారు.

గీ. ఇందు, భూమిచ్చి రామలింగేశ్వరునకు
గౌరవముగన్న కనకయ గౌరమాంబి
కలను శ్రీ వేంకటేశ్వరు డలఘుమతియు
సీతరామయ్యయును గల్గి ఖ్యాతిగనిరి.

సీ. పతిమాట మీరని సతి సరస్వతితోడ
చెలిమియే కలిమిగా దలచువాడు
వేంకటప్పారాయ ప్రియకుమారుని జేరి
విద్యావినోదియై వెలయువాడు
తనచేయి క్రిందుగా మనలేని మనసుతో
త్యాగవ్రతాసక్తి దనరువాడు
గాంధేయులకు ప్రీతి గొలిగించు పెద్దయై
తీయగా పొలికేక వేయువాడు

గీ. తన తనూజులైనట్టి, సత్యప్రసాదు
రామమూర్తుల తీర్చెడు ప్రేమమూర్తి
పరమగుణశాలి వేంకటేశ్వరుడనంగ
పొగడ నేటికి వాడకే పొగడపూవు.

గీ. వైద్యవిద్యాప్రదాతలౌ వారియెడల
తన కృతజ్ఞత నెరపి భూదానమిచ్చి
సరసమతియైన వేంకటేశ్వరుడు నాడు
ధన్యుడయ్యెను నిజకులోద్ధారుడనగ.

క. భోగార్థమిచ్చె స్వామికి
మాగాణము కొంత - నింత మహితయశుండై
సాగించుగాక, సంతతి
భోగము భాగ్యంబుగలిగి పుణ్యాత్ముండై.

కృతినాథుడైన

శ్రీ వేణుగోపాలస్వామి ఆలయ నిర్మాత

## దారా నరసయ్యకు ఆశీస్సు

శా. దారా నర్సయ శేషమాంబలకు సంతానంబు సంసారమే
భారంబయ్యె నటంచు జాలిపడి గోపాలుండె తావచ్చి ని
ల్చెన్ రమ్యాకృతి పూర్వజన్మఫలమై శ్రీవారికై భూమియున్
ద్వారంబుల్ గుడిగోపురంబులును సంధానించె సామాన్యుడే.

గీ. తాతతండ్రుల నొసటిపై వ్రాతలెల్ల
తీర్చె నరసయ్య పుట్టి సందేహమేల
సిరియు సంపదతో తరతరము లిట్లె
వేణుగోపాలదేవు సేవింతురిగాక !

# శ్రీ కృష్ణార్పణము

ముప్ఫైదేండ్లు పరిశ్రమిస్తే ఇది ఎనిమిదోనాటకం- ఇంతేనా-?

ఈ మధ్యకాలంలో, శ్రవ్య, చిత్ర - హిందీ అనునాద చిత్ర నాటకాలు వ్రాశాననుకోండి. రంగస్థల యోగ్యమైన నాటకం మనకు కావాలని నా అభిలాష. అందువల్ల, ప్రదర్శనచేస్తేనేకాని ముద్రించ నన్న దీక్షవల్ల - ఈ విరామంలో, ఎన్ని చరిత్రలు, సన్నివేశాలు, నన్ను ఆవేశపెట్టి - ఆశపెట్టి - నా గుండెలపైననే ఆడి, అలసట తీర్చుకున్నవో ! ఇప్పుడు, "కర్ణధారి" ని ప్రదర్శించకుండానే పాఠ కుని చేతుల్లో పెడుతున్నాను.

నాదీక్ష సడలించుకున్నాను, ముఖ్యంగా ఈనాటకం వరకే. ఎందుకంటే-ఈనాటకంలో ముందుగా తానే కర్ణపాత్ర ధరించి, తెలు గునాడులోనేకాదు- యావద్భారతంలోనే తెలుగునటరాజుకు జైత్ర యాత్ర చేయిస్తానని ఉబలాటపడిన మాఅన్న, మాధవపెద్ది నా కీర్తి పతాక సహా కైలాసవాసి ఐనాడు.

తెలుగుజాతికి గర్వకారణమైన ఆ గారాబునటరాజు ఎవరి నైనా ఆశీర్వదిస్తాడో... దుర్బలమైన ఈనాటకాన్ని తాను తిరిగి వచ్చేదాకా యిలాగే నిలిపి యుంచుతాడో ఊహించలేను.

శక్తివంతమైన సమాజాలు——

సహృదయులైన నటులు——

సరసులైన ప్రేక్షకులు——

ఎవరికి ఎవరు బాధ్యులు కానట్లు నడిచి పోతూన్న ఈకాలంలో; కీర్తి దాహంతో పడదోసుకుని పరుగెత్తివెళ్ళే తొందరలో, ప్రదర్శనచేసే దెవరు-? కాదు... జయప్రదంచేసేదెవరు-? ?

సద్విమర్శకుని పుక్కిటి తాంబూలంతో రాగిల్లి, పాఠకుని కన్నులు చెమ్మగిల్లిననాడుగదా ఏకవియైనా ఇంకో అడుగు ముందుకు వేసేది –?

భావికాలపు బిడ్డలు ప్రతిభావంతులు కావడానికి – స్వతంత్రభావుకులై రాణించటానికి – దీనిలోని యే చిన్ని ఊహ సహాయపడినా, అది, కర్ణధారిని అంకితంచేసుకున్న స్వామి దే–

నాకు పూజ్యులు, పితృసమానులూ అయిన శ్రీ మాకరాజు నారాయణరాజు కవిగారు ముద్రణమయ్యేదాకా నన్ను నిమిత్తమాత్రునిగా దగ్గరపెట్టుకునిసమస్తమూ నిర్వహించిన వారి విశాలకవితా హృదయానికి యేమీయగలను–? ఇప్పుడు నాచేతులకు నమస్కారం చేసే శక్తిమాత్రమే ఉంది–

మీ నాటకకవి

—సత్యనారాయణరావు



# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు

–: పు రు షు లు :–

శ్రీకృష్ణుడు — అర్జునుడు — కర్ణుడు
వృషసేనుడు — బ్రాహ్మణుడు
శల్యుడు — సేవకులు

–: స్త్రీలు :–

కర్ణుని భార్య – కుంతి

# క ర్ణ భా రి

## ౧వ రంగము

( రాత్రి 8 గంటలై వుంటుంది. శ్రీకృష్ణునితో చాలాదూరం ఏకాంతంగా మాట్లాడి తిరిగివచ్చాడు కర్ణుడు. కృష్ణ రాయబారం వృథా ఐనదని హాస్తినాపురవాసు లెవ్వరికీ ఇంకా తెలియదు. పట్టణమంతా కృష్ణకథాశ్రవణంతో, భజనలతో ప్రతిధ్వనిస్తోంది. కర్ణుని భార్య పూజామందిరంలో పాడుకుంటూంది. )

( పాట )

భార్య :— కానలేను కృష్ణా !

దరి గానలేను కృష్ణా !

సారరహిత, సంసారపాప పరిహార

గోపకకిశోరా ! కృష్ణా ! కృష్ణా ! —కానలేను—

కామక్రోధ వికారవివశులయి

కలిమి బలిమి పెనుగర్వితమతులయి

—కానలేను—

( కర్ణుడు చూస్తూ నవ్వి పరధ్యానంగా వెళ్ళుతుంటాడు. )

కర్ణు:— శ్రీకృష్ణుడంటే ప్రతివారికి ఈ వెఱ్ఱియెందుకో, ఇంతకన్నా దేవుడే లేనట్టు ?

( భార్య దగ్గరకు వస్తుంది )

భార్య:— ఇదేనా రావటం ?

కర్ణు:— ( ఏదో ఆలోచన— ఆశ్చర్యం పొందుతూ వినిపించుకోలేదు, )

భార్య:— స్వామితో చాలాదూరం వెళ్ళివచ్చారన్నమాట ! ఏమన్నారు భగవానులు ?

( కర్ణుడు తేరుకున్నట్టు చూస్తాడు )

భార్య:— ఓహో ! ఎంత ధన్యులండీ మీరు! కేవలం భగవానుడు– ఆ పరమపద నాథునితో సాంగత్యం లభించింది.

కర్ణ:— ఏమిటి – ?

భార్య:— అంతరంగమాత్రులకు శ్రీకృష్ణదేవుని సేవాభాగ్యం లభిస్తుందా ?

కర్ణ:— (ఒక్క నిట్టూర్పు విడిచి) ఊఁ —

భార్య:— మరి, రాయబారం శాంతంగా సాగలేదన్నారు ?

కర్ణ:— ఓఁ– సాగకేమి ?

భార్య:— ఫలించిందా స్వామి కార్యం ?

కర్ణ:— ఆఁ సార్వభౌముడికి ఫలించింది.

భార్య:— అంటే – యుద్ధమా ? యుద్ధం తప్పదన్నమాటేగా.

(కర్ణుడి మనస్సు ఇంకా ఆ కృష్ణస్పర్శ సంభాషణ ఆ ఆప్యాయమైన మంతనం వేపే పెనవేసుకునివుంది. అతని జీవిత ధర్మాలనే కలవర పెడుతూన్న అవస్థ )

భార్య:— ఏం మాట్లాడరేం – ఏంటి ఆలోచిస్తున్నారు ?

కర్ణ:— యుద్ధం ... అంతర్యుద్ధం ! కృష్ణా ! ఎంత చమత్కారివి-కాదు. ఆ సాహసం – అది ఎంత రాటుతేలిన రాచకీయ ధురంధరులనైనా – పోటు మగసిరిగల వీరులనైనా కనుమూపుమాత్రం లోనే అవశుల్ని చేస్తుంది. ఇది అంతా నిజమేనా ?

మ. కలయా? కాదు నిజంబె; ఔను నిజమా గాకేమి–వాడంతలో
వెలుగై తోచును వెన్నెలై పరచు తీవ్రిన్ మేఘ నిర్ఘోష భా

కర్కాల నందందు చమత్కరించుటకు సంకోచింపడొక్కొక్కచో
పలుకుగ్ భూతభవిష్యదర్థములనుగ్ బ్రహ్మాండ వేద్యుండుగా॥
( వికటంగా నవ్వుకొంటాడు )

భార్య:— మిమ్మల్నే - ఎవరితోటి ఆ మాట్లాట్టం ? ఇంకా మీ మనస్సు మరలినట్లు లేదు.

కర్ణు:— ఆఁ లేదు. మళ్ళించుకొన్నాను. చాలా ప్రియాస పడి మళ్ళించుకొన్నాను. అలా మళ్ళించుకోకుంటే - నా మనస్సు మారిపోతే యిహ యుద్ధమే లేదు. యుద్ధానికి అవకాశమే వుండేది కాదు.

భార్య:— మంచిదేకదా ! యుద్ధం చేయవలసిన అవసరం లేనిక పరమాత్ముడు వచ్చిన రాయబారం సఫలమైతే ఒక్క దేశ శాంతియేకాదు. సామ్రాజ్య శాంతియే కాదు. జగత్కల్యాణమే సిద్ధించేది గదా ?

కర్ణు:— ఓహోహో ! ఎంత తప్పుపని జరిగింది? ఎంత తప్పుపని జరిగింది ? అసలు తప్పు ఇంకోటి జరిగింది. చెప్పనా ?

మ. ఘనకార్యంబది కాలరాతురె, ప్రజా కల్యాణమే అయ్యెనో
యని చింతింపకు - నాకుగూడ నొకకల్యాణంబు రాజాజ్ఞచే
అనువై వచ్చియు జారిపోయె నొకకల్యాణం బనృష్టింబు గా
లని కాలంబెదురొచ్చె గొప్ప యుగకల్యాణంబె సర్వస్వముగ్॥

భార్య:— ఇవ్వాళ మీధోరణి అదోవిధంగా వుందేమిటి ? నా కేమీ తెలీటంలేదు మీ మాటల అర్థం. అగమ్యంగా వుంది. చెప్ప వద్దా- మీకు ఇంకో కల్యాణమేంటి ?

కర్ణు:— నా కల్యాణమా... ద్రౌపదీదేవితో... జరిగేసిందా ! (నవ్వు)

భార్య:— ఏమి పాపపుమాటలు ! నిజంగానా? చెప్పండి,నిజంగానా ?

కర్ణు:— పాపము కాదుట. పిచ్చిదానా ! గొప్ప అనులాపముతో

తెలవిచ్చినారు మీ శ్రీకృష్ణులు. అది నే నంగీకరించనందున పెక్కు సంతాపముకూడా కలిగినది వారికి -

భార్య:—శ్రీకృష్ణులు... మీకు ద్రౌపదీదేవిని భార్యగా చేస్తా నన్నారా ? ఎంత రాజతంత్రమైనా...

కర్ణ:— రాజతంత్రంకాదు. ఈ విషయంలో యథార్థంగానే.

భార్య:— ఆమె పాండవ పట్టమహిషి కదా !

కర్ణు:— ఏం ఐతే - ?

భార్య:—వారు సుక్షత్రియులైన రాచవారు. ఆమె అయోనిజ. ...

కర్ణు:—ఆగు. ఇంతయేల నే నంగీకరించినచో సర్వమూ సంభవ మయ్యేది.

భార్య:—అమ్మయ్య. నా హృదయేశ్వరులుమీరు. నామీదయింత అనురాగముందా? నాకోరకేగదా! యెంతెంతవారికీ దుస్సాధ్యమయిన ఈ కామ్యకాంక్ష మీరు అరికట్ట గలిగింది.

(కాళ్ళమీదపడుతుంది. కండ్లలో ఆనందబాష్పాలు కమ్ముకుంటాయి. కర్ణుడు అనురాగంతో లేపదీస్తాడు)

చూడండీ! ఈ విషయం మీరంగీకరిస్తే యుద్ధమాగి పోయే దేనా! ఈప్రజాసంక్షోభం, దుర్భిక్షం, మారణహోమం ఆగి పోయేదేనా?

మీరు ఏకపత్నీవ్రతులై భాసించటానికి, నన్నుద్ధరించటానికి ఈ యుద్ధజ్వాలలను ప్రకోపింప జేశారా? అయ్యో! యుద్ధం మాటంటే నా గుండెలు కొట్టుకుంటున్నాయి. యుద్ధంలో జయాపజయాలు నిర్ణయించలేము— పసివాళ్ళున్నారు. పండు వంటి కాపురం— యెంతమందో మనలాంటివాళ్ళు—

కర్ణు:—నిజమే! తప్పనిసరియైవస్తే ఏంచేస్తాం.

భార్య:—తప్పని సరేంటి- మీరు నివారిస్తారు. సార్వభౌమునితో గట్టిగా మీరు—

కర్ణ:—నేను కాదుగదా దేవేంద్రుడు వచ్చి చెప్పినా—

భార్య:—(అడ్డం వచ్చి) మీరేమనుకుంటున్నారో! మీ మీదనే ఈభారం అంతా వదిలేస్తారు. మిమ్మల్నే ప్రధానపాత్రగా పెట్టి అంతా పెద్దమనుష్యుల్లా ధర్మపన్నాలు చెబుతూ వెనక్కు తగ్గుతారు. ఒక్కప్రార్థన వినండి యేమైనాసరే.

కర్ణ:—చెప్పు— వింటానేమో—

భార్య:—వినాలి. ఈ యుద్ధం ఆపుచేయండి. వద్దు. ఈపాడుయుద్ధాలతో మనకు పనేముంది. ఈ శరీరం, సుందరమైన మీ ఈశరీరము ప్రతినిమిషం గాయాలతో, రక్తంతో అమ్మో! ఎప్పటికప్పుడు బతుకే సంశయావస్థలోపడి... వద్దు వద్దు యేమయినా కానివ్వండి.

నాకేమనిపిస్తూంటుందంటే— వింటున్నారా? సరిగా. నన్నిప్పుడు మన్నించాలి. ఈ దాసురాలు ఎప్పుడూ మీదే. మీకన్నా ప్రపంచం లేదు. బ్రతుకులేదు...

కర్ణ:—కాబట్టి—

భార్య:—ఆ శ్రీకృష్ణుడు చెప్పినమాట [illegible]. నా మాంగల్యాన్ని [illegible] ప్రభూ!

ఆలోచించకండి. [illegible] మాంగల్యాలు [illegible] యుద్ధంలో [illegible] ఆలోచించండి. నా [illegible]. నా శ్రేయస్సు [illegible] యేమైనా [illegible].

మ. కరుణాహీనులు [illegible] సంగ్రామంబులో చంపించి [illegible] ! [illegible] రాజ్యాలకై [illegible] కాదో [illegible].

ద్రౌపదిని పెండ్లాడండి. నేను ఆమె పాదధూళి తలపై ధరిస్తాను. ఆమెకు ఊడిగం చేస్తాను—

కర్ణు:—ప్రియురాలా! నీవు వీరపత్నివి కావటం ఇష్టంలేదా?

భార్య:—వీరపత్నిని కావాలనీ, మహారాజపత్నిని కావాలనీ నేనెప్పుడూ కోరుకోను. మీకు ధర్మపత్నిగా యిలావుంటే చాలు.

కర్ణు:—నేనంగీకరిస్తే మహారాజు పత్నివికూడా అయ్యేదానివే. శ్రీకృష్ణులుస్వయంగా ఆధిపత్యం వహించి ముందునడిచేవారు. ధర్మరాజంతవాడు మనకు చామరం వీస్తుంటే; భీమసేనుడు, అర్జునుడు ఛత్రము పట్టేవారుగా, నకుల సహదేవులు పరిచారకులుగా నవభారత శుభోదయ మయ్యేది. ఇంతయేల—

శా. రేపీపాటికి హస్తినాపురము ఖాళీచేసి ద్వీపాంతరం
బే పోమ్మంచును శాసనం బిడగలేనె రాజుపై—ద్రౌపదికా
నా పీఠంబున జేర్చి నీవు జతగా నానా ప్రజాభాగ్యదా
ఈపుణ్యప్రదమైన భారతము సేవింతుగా గదే సుందరీ!

భార్య:—ఐతే ఆసుందరమైనదృశ్యాన్ని చెరిపివేశారా! యదార్థభారతాన్ని యిలా స్వప్నభారతంగా సంతరించారా! మీబాహుబల దర్పాలతో సార్వభౌముడికి అండగా వున్నారనీ— సార్వభౌముడు సామ్రాజ్యకాంక్షతో వినాశం కోల్పోయియుద్ధానికే పురికొల్పి ప్రజాక్షయం చేస్తాడని, స్వామి ఆందోళనపడి స్వయంగా దయచేశారు. ముఖ్యంగా మీ క్షేమంకోరి చెప్పారు. మీ రెందుకు స్వామినిర్ణయం త్రోసిపుచ్చారు? స్పష్టంగా తేల్చి తెలిపారా స్వామికి యుద్ధంతప్పదని? (అడ్డంగాపోయి మానసముద్రిదాల్చి లేచిపోతూన్న భర్తను కదలించి అడుగుతూంది) ఇంకామీరు స్పష్టం చేయలేదుగదా మీనిశ్చయం?

కర్ణు:—చేశాను. ఐపోయింది. యుద్ధం ప్రకటించినట్లే.

ద్రౌపదిని పెండ్లాడండి. నేను ఆమె పాదధూళి తల్పై ధరి
స్తాను. ఆమెకు ఊడిగంచేస్తాను—

కర్ణ:—ప్రియురాలా! నీవు వీరపత్నివి కావటం ఇష్టంలేదా?

భార్య:—వీరపత్నిని కావాలనీ, మహారాజపత్నిని కావాలనీ నేనెప్పు
డూ కోరుకోను. మీకు ధర్మపత్నిగా యిలావుంటే చాలు.

కర్ణ:—నేనంగీకరిస్తే మహారాజు పత్నివికూడాఅయ్యేదానివే. శ్రీకృ
ష్ణులుస్వయంగా ఆధిపత్యంవహించి ముందునడిచేవారు. ధర్మ
రాజంతవాడు మనకు ఛామరం వీస్తుంటే; భీమసేనుడు, అర్జు
నుడు ఛత్రము పట్టేవారుగా, నకుల సహదేవులు పరిచారకు
లుగా నవభారత శుభోదయ మయ్యేది. ఇంతయేల—

శా. రేపీపాటికి హస్తినాపురము ఖాళీచేసి ద్వీపాంతరం
బే పొమ్మంచును శాసనం బిడగలేనే రాజుపై-ద్రౌపదీ
నా పీఠంబున జేర్చి నీవు జతగా నానా ప్రజాభాగ్యదా
ఈపుణ్యప్రదమైన భారతము సేవింతుగా గదే సుందరీ!

భార్య:—ఐతే ఆసుందరమైనదృశ్యాన్ని చెరిపివేశారా! యదార్థభార
తాన్ని యిలా స్వప్నభారతంగా సంతరించారా! మీబాహు
బల దర్పాలతో సార్వభౌముడికి అండగా వున్నారనీ- సార్వ
భౌముడు సామ్రాజ్యకాంక్షతో వివేకం కోల్పోయియుద్ధా
నికే పురికొల్పి ప్రజాక్షయం చేస్తాడని, స్వామి ఆందోళనపడి
స్వయంగా దయచేశారు. ముఖ్యంగా మీ క్షేమంగోరి
చెప్పారు. మీ రెందుకు స్వామినిర్ణయం తోసిపుచ్చారు?
స్పష్టంగా తేల్చి తెలిపారాస్వామికి యుద్ధంతప్పదని? (అడ్డంగా
పోయి మౌనముద్రదాల్చి లేచిపోతూన్న భర్తను కదిలించి
అడుగుతూంది) ఇంకామీారు స్పష్టం చేయలేదుగదా
మీానిశ్చయం?

కర్ణ:—చేశాను. ఐపోయింది. యుద్ధం ప్రకటించినట్లే.

భార్య:——ఎవరు, మీరా ?
కర్ణుడు:——సార్వభౌముడు—
భార్య:——సార్వభౌముడికి నచ్చజెప్పలేకపోయినారా మీరు!

ఉ. ఎంతటి మిత్రుసైనను సహింతురె ? ఏమి వినాశకాలపున్
రంతులు రాజరాజునకు – ప్రాభవశాలురు మిమ్ముబోలు సా
మంతులుగల్గువార లొకమాట వచించిన తేలిపోవు – ని
దింతురు హాయిగా తమ సతీసుతులన్ గవగూడి భూప్రజల్

ఐనా అంతకాంక్ష యెందుకు రాజ్యంమీద — !

కర్ణు— కాంక్షయో— గర్వమో— మంకుపట్టు పట్టినాడు.
భార్య— అందుకొరకు ...
కర్ణు— అందుకొరకే యుద్ధం.
భార్య— ధర్మమంటారా దీన్ని?
కర్ణ — కర్ణుని ధర్మంమాత్రం సార్వభౌముని ఆజ్ఞాపాలనం.
భార్య:—— ఇలాంటిఆజ్ఞ పాలించి తీరాలిసిందేనా?
కర్ణు:—— తప్పదు.
భార్య:—— భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలు కురువృద్ధులు. వారందరేమన్నారు?
కర్ణు:——ఒకరేమిటి – ధృతరాష్ట్ర గాంధారులు కూడా మందలించినారు. వినలేదు.

భార్య:—— ఇదంతా లోకానికి తెలీదుగదా ! తెలియదని ఊరుకుంటుందా ? మీవల్లనే ఈ ప్రజాక్షయం ఏర్పడిందని అపవాదు వేస్తారేమోనని భయంగా వుంది.

కర్ణు:—— ఇంకా ఫందేహమా ? తప్పక నామీదే విరుచుకు పడుతుంది లోకం.

భార్య:— ఈ ఘోరసమరణకాండకు ఏమీ దోషం ఏమీ లేదని పోనీ స్వామి గ్రహించారా ?

కర్ణు:—గ్రహించే వుంటారు.

భార్య:— బాగుంది. రాజులతో చెలిమి పాములతో చెలిమిచేసినట్లని పెద్దలనేమాట మన పట్ల బాగా అన్వయించింది. కాస్త విశ్రాంతి తీసుకోండి. చాలా పొద్దుపోయింది.

కర్ణు:— (బాధగా నిట్టూరుస్తాడు) ఎవరైనానాకోసంవస్తే తెల్లవారి దర్బారుకు వస్తారని చెప్పు.

భార్య:—(తనలో) ఈ రాత్రి నిద్రపోరు. ఎంత అపచారం చేస్తున్నారు- స్వామికి అంతా కలిసి - (లోపలికి వెళ్ళుతుంది)

[కర్ణుడు ఆందోళనతో మంచంమీద నిద్రపట్టక కూర్చొనివుంటాడు. ఆతని అంతరాత్మలో తిరిగే ఆలోచన లిలా వినిపిస్తున్నాయి.]

అంతర్వాణి:—ఈ కర్ణుని జీవితాన్ని ఎంత నికృష్టం చేస్తున్నారు. ఎన్ని సంఘర్షణలు ఈ బ్రతుకంతా - నన్ను నేను ఉదారుడనుగా చేసుకొని జీవనభారం దింపుకోకుండా ఐపోతున్నానేమి ?

మనుష్యుడు ప్రయాణించినంతసేపూ అడుగడుగునకూ పర్వతశ్రేణులు పగులగొట్టుకొంటూ పొయ్యే విధమెట్లా ? బండలేమో పగులవచ్చును. అలసట రాదా- ? ఎంత మెలకువగా శిఖరాలు కూల్చేవాడైనా, ఒకప్పుడైనా అవి తలపై కూలవని ఎవ్వడనగలడు? ఇంతటి ప్రమాద భూయిష్టమయిన జీవితయాత్ర అందరికీ రాదు- రాకూడదు- వీటికేమి—

ఆ శ్రీకృష్ణుడు నా అంధకారమయమయిన- నన్ను చలపెట్టి బాధిస్తున్న, నాజీవితరహస్యాన్ని బైటపెట్టి నన్నుద్ధరించాడు. మహానుభావుడు. నాశిరస్సులో కుమిలిపోతున్నాన్న యుద్ధజ్వాల అణిగిపోయింది. కుంతీదేవి మా అమ్మనూ- ఓహో!

అమ్మా! నీవు అమాయికురాలవై ఉన్నప్పుడు- సామ్రాజ్ఞివి కానప్పుడు నీ పవిత్రగర్భంలో ఆ జగత్సాక్షి కాహ్వానం యిచ్చి నన్ను కన్నావుటమ్మా మాతల్లీ!

(పడుకోవాలని శాలువసవరించుకొని మంచంమీద మేనువాలుస్తాడు. ఆవులిస్తాడు

కర్ణుని ఊహాపథంలోని శ్రీకృష్ణుని ఆప్తవచనాలు - కాదు - శ్రీకృష్ణుడే వచ్చి వాని ఎదురుగా దూరంగా మాట్లాడుతున్నట్టు అనుభవం ఐతుంది.

శ్రీకృష్ణాంశము ప్రవేసిస్తుంది. కర్ణుడు గ్రహించకుండా మాయావరణం ఒక్క- కరచాలనంతో ప్రసారిస్తుంది)

శ్రీకృ:—

శా. ఆలోచింపుము బావ! నీవె సమరవ్యామోహి వైనావ! ప్ర-
బాలార్క- ప్రతిభా సముజ్వలమహః ప్రారంభ శోభా కృతుల్,
ప్రోలై వచ్చెనొ అట్టివేషమును రేపో మాపో రక్తంబులో
తేలం జూడగలేక నీకొరకె ప్రత్యేకంబుగావచ్చితిన్॥

కర్ణు:— ఎవ్వరది? (అటు ఇటు ఆశ్చర్యంతో చూస్తాడు- లేస్తాడు) ఎవరూ లేరే! ఈవాణి ఎక్కడనుండి వినిపిస్తూంది. కాదు. ఈ సంగీతం- వీణా ఝుంకారంవలె పూరిస్తూందెవరు—కృష్ణా! కృష్ణుడెక్కడ వున్నాడు? ఉంటే; ఆ స్పర్శ, నేను ఆతనితో మాట్లాడే టప్పుడు పొందిన స్పర్శ- ఆహా! ఆతడు భగవంతుడు కాడనే అనుకున్నా, అబ్బ! వాని స్పర్శలో స్వర్గసుఖాలన్నీ చూరగొన్నాను. నిజమేనయ్యా! నీవు నాతో రాచకీయపు యెత్తులతో మాట్లాడలేదయ్యా! నన్ను ప్రలోభపెట్టాలని చెప్పలేదని ఒప్పుకుంటాను.

నామీదనీకు వ్యామోహం ఉన్నమాటనిజం. నేను కని

పెట్టాను. పెద్దబావా! నన్ను నమ్మవా అని నీవు కంటనీరు పెట్టుకోటం నేను చూశాను. అప్పుడు నీవు తలవంచుకుని ఉన్నావు. అంతవరకూ చకచ్చకలతో గర్వంగా మెరిసిపోయే నీ నెమలి తురాయి, అదికూడా చిన్నబుచ్చుకొని తలవంచుకున్నది. ప్రపంచాన్నే పరియాచకా లాడుతున్నట్టు కనిపించే నీ కింది పెదవి క్షణకాలం కంపించటం నేను చూడలేదనుకున్నావా? మనుష్యుడవే అనుకున్నా- ఎంతగొప్ప మనుష్యత్వమయ్యా! నీది?

శ్రీకృ:—

ఏ బాలార్క-ప్రతిభాసముజ్వలదుషఃప్రారంభ శోభాకృతుల్
ప్రాలై వచ్చెనో, అట్టివేషమును రేపోమాపొ రక్తంబులో
తేలం జూడగలేక నీకొరకె ప్రత్యేకంబుగా వచ్చితిన్.

కర్ణు:—నా దేహం మీదేనా నీకింతగౌరవం! పోనీ! ఏం! పోతే- అదుగో! మళ్ళీ సంగీతం.

శ్రీకృ:—

మ. తనభార్యన్ పరుడెంతవాడయిన; వస్త్రంబూడ్చుచో ఓర్పుతో
మనియుండం గలవారె, ఆత్మబల సంపన్నుల్ వినా—శత్రురా
జనుమానించును గాక దుర్బలులుగా- ప్రాజ్ఞ- ల్సదా దానశూ
ర నియంతృత్వమె చెల్లువారలకు యేలా దుష్టు మోమోటముల్.

కర్ణు:— మోమోటపడటల్లేదయ్యా! నేను మోమోటపడటల్లేదు. సార్వభౌముడు దుష్టుడంటున్నావా? అను. అనండి మీరంతా. మీరు అసత్య మాడకపోవచ్చు- కానీ, నేనాయన కొరకు ఏదయినా సరే త్యజిస్తాను. సార్వభౌమునికై నేను త్యాగం చేయనిదే లేదు. ఆయన సేవకై యేమైనాచేస్తాను. ఈ భయంకర ప్రపంచయుద్ధాన్ని- యుద్ధం చుట్టుముట్టుకోటానికే తలపెట్టిన ఆయన మృష్కర వాంఛనుగూడా- ఒక్కనామాట నిలబెట్టు

కోటానికి- అందుకే త్యాగం, సేవ, మనుష్యుడి ధర్మాలు గదా అని నిశ్చయించుకున్నాను. ఆ ఒక్క-మాటకోసమే—

ఎందుకంటే- ఒకనాడు యీ మనుష్యమాత్రుడైై వచ్చిన కర్ణుణ్ణి నీచ మర్యాదకు గురిచేసి, కుమారాస్త్రవిద్యాప్రదర్శన మప్పుడు, జ్ఞాపకముందా-? యెత్తయిన ఆ సింహద్వారం ముందు ద్రోణాదులు మొదలు ఆబాల గోపాలం "శూద్రుడు శూద్రుడు. శూద్రునితో సుక్షత్రియుని ప్రదర్శనమా?" అని యేవగించుకున్నప్పుడు— ఈ కర్ణుడు కుంగి కుంగి ద్వారమున కెత్తయిన ఈ కర్ణుని దేహము వంగిపోయి ద్వారము దగ్గరే కూలిపోయినంత పనిఐంది. అప్పుడు, అప్పటి కప్పుడు

సీ. తన కిరీటముదీసి తలవంచి నను కను
సన్న జేసియు కరస్పర్శ జేసి
అప్పటి కప్పుడే- అంగరాజును జేసి
అభిషేకమునకయి ఆన జేసి
తన రాజమందిర ద్వారతోరణముల
మా స్నేహ చిత్రాల మలచి చూసి
భరత మహారాజ్య భారసంరక్షణ
నాదని ఆస్ఫాలనమ్ము చేసి

గీ॥ ఆదుకొనువేళ నేజేసినట్టి బాస-
స్నేహపుంబాస- ఆబాస చెరుపలేను.
స్థిరముగా నాకృతజ్ఞతా చిహ్నమైన
అట్టి చేయిచ్చినట్టి స్నేహంపుబాస...
(యేమో చెప్పబోతాడు యింకా)

శ్రీకృ:—

శా. పోవయ్యా-ఇటువంటి స్నేహమ్మునే కాపున్ శాట్కీ-లోభమ్ములో
తేమిపం దగ్గువాని సేవకుని శేషెన్ రాజరా జయ్యారో!

బావా ! నీకును నాకు నేడె తెగ తెంపై పోవు ఈ ధర్మమున్
నీవై తీర్చకయున్న తప్పదిక నేనేవత్తు లోకార్థమై.

కర్ణ:—ఒక్కమాట... నా మాటకూడా వినాలి మరి ...

శ్రీకృ:—గీ. రాజసూయ మహాధ్వర ప్రథితమైన
బాహుకండూతితో రాజుపైన వారు
తిరుగబడి పెడరెక్కలు విరిచికట్టి
తొడలు పొడిచేయుదురు, స్నేహముడుగు కర్ణ !

కర్ణ:—తొడలు పొడిచేస్తే చేస్తారేమో ! ఆ సంగతితరువాతగదా—
నేను మనవిచేసేది వినండి... పెద్దలు మరి.

శ్రీకృ:—గీ. ఈ పెనుతుపాను రేపి – అహింస కెదురు
హింస చలపెట్టిన ఫలం బదెవరికగునో ?
ద్వాపరయుగాంత మగుదాక ధర్మసుతుడు
లొంగిపోడు – పోబోవడు ... లొంగిపోడు.

( శ్రీకృష్ణుడు వెళ్ళిపోతాడు )

కర్ణ:—కృష్ణా – కృష్ణా !! ఎక్కడ ? ఆశబ్దం వినిపించదేం–?
( ఇంకోవైపుచూస్తూ ) నేను చెప్పేది వినిపోవయ్యా–

( భార్య గాభరాపడి ప్రవేశం )

భార్య:—ఏమిటండీ, నిద్రపోలేదా–? శ్రీకృష్ణుడేంటి–? కలవరింతపడి
లేచారా – భ్రాంతియా – ?

కర్ణ:— భ్రాంతీకాదు, కలాకాదు. నిజంగానే – నేను మేలుకొనే
వున్నాను.

భార్య:—నిబ్బరించుకొని చెప్పండి ... మీ మనస్సులో ఆందోళన
శాంతించక ...

కర్ణ:—ఆందోళన కాదు – ఆందోళన కూడా వుందనుకో – ఏదో
మహామాయ నన్నావరించిన ట్లనిపించింది. క్షణంలో ఒక

శబ్దం...శబ్దమే కాదు — అదో సంగీతమే ... అది శ్రవణ పేయంగా ఆరంభమై- అయి — తుదకు సుడిగాలి విసురు వలె నా తలచుట్టూ తిరిగి తిరిగి భీభత్సంచేసి ఎక్కడో - ఎక్కడో ఆకాశం చివరల్లో అంతర్లీనమై పోయింది. ఐతే, ఆ మాటలు ఇదివరకు చెప్పినమాటలో — లేక ఇంకా నా మీద, నా ధర్మచింతనమీద నమ్మకం- ప్రేమ పోగొట్టుకో లేక చెప్పిపోవ టానికి వచ్చిన శ్రీకృష్ణుని అంతర రహస్యమో, అది నా ఆందోళనకాదు — అదేమీ కాదే ...

భార్య:——నన్నెందుకు లేపలేదండీ? అంత గందరగోళం జరుగుతుంటే. పాడునిద్ర నాకప్పుడే ముంచుకువచ్చిందేమో కూడా ...

కర్ణు:—— ఎంత గాంభీర్యం...ఎంత సాహసం అతనిది — ? ఆ రాచ కీయ వేతృత్వం — ఆ గాంభీర్య ముద్ర ... యుద్ధం అంటే యెంత నిర్భయం — పసితనమందే భుజము చరిచి సింహము వంటి కంసునిపై బడి కబళించిన సాహసుడు వాడు. ఇప్పుడు — ఇప్పుడు మాత్రం తగ్గిపోయెనా ... కాని- ఆ శాంతము — శాంతికై చేయిచాచి అడిగినాడే ...వాని ఒక్కమాట మీద నాకు నమ్మకం కుదిరింది. అంతటివాడు తన చెల్లెలిని, నోరు విడిచి భార్యగా ఏలుకోవచ్చునని చెపుతాడుటే...

భార్య:—— ఇప్పటికి మాత్రం మీ నిశ్చయం మారిందేముంది ? మార్చుకోటానికి ఇంకా మించలేదు ... తొందరపడకండి.

కర్ణు:—— ఇంకేమి తొందర- తొందరే లేదు. ఏనాడు స్నేహపుబాస జారానో అన్నితొందరలు ఆనాడే ముగిసిపోయినై - ఓః- ఆ బాస జన్మంతా ఆయాస పెతుతూంది. ఆయాసమే కాదు. అది మనుష్యధర్మమే — ఆ ధర్మం నాకు తెలుసు. ఎంత ధర్మమైనా ...

[ బైట ... అంగరాజా ... అంగరాజా ... ]

భార్య:—(వెళ్ళి వస్తూంది) తెల్లవారి వారే దయచేస్తారని చెప్పరా.

కర్ణు:—ఎంత ధర్మమైనా సార్వభౌము డెప్పుడూ నా శరీర బల దర్పాలే కోరుకొంటాడేమి... నా ప్రారబ్ధము. నా బుద్ధిబలం కోరడు. కోరికోరి నేనై చెప్పినా అంగీకరింపడు గదే...

భార్య:— క్షమించండి– వారు రాయబారం భగ్నం చేయవచ్చు. యుద్ధాన్నే ఆహ్వానింపవచ్చు – ఏది యెట్లాగైనా ... ఎవరికి స్వార్థంలేదో,... ఎవరికి యుద్ధంచేయటానికి ఇష్టంలేదో, వారికీ వారి ఆత్మలకు స్వాతంత్ర్యం లేకుండా అరికడతాడా...?

కర్ణు:— ... ఆత్మ స్వాతంత్ర్యమా ? ఆ – అరికడతాడు ... కట్టాడు ... అబ్బ– నా ఒడలు ... వజ్రాయుధఘాతానికైనా కంపించని ఈ ఒడలు, ఒకసారి– కంపించిపోయింది ... ఈ సాయంత్రం సభ జరుగుతుండగా ... అబ్బః– చెప్పలేనే ... ఎంత దారుణం ... ఎంతనీచం ...

భార్య:— ఏమైంది ... చెప్పండి ... తీరిపోయిందిగదా – అంతా–

కర్ణు:—ఎక్కడ తీరిపోతుందే ... ఆ నైచ్యం నేనై ... ఓః – సహించు కునేదికాదు. శ్రీకృష్ణుని – సభామధ్యంలో ... సభామధ్యం లోనే కట్టివేతాము రమ్మని నన్నీడ్చుకొని పోయినాడు. అప్పుడు– అప్పుడుకాదు– ఇప్పటికీ ఆ ఒడలికంపము పోలేదు.

భార్య:—అయ్యో ... అయ్యో ...

కర్ణు:— ఆ దుండగంలో ... దోర్బలశాలికి ... నాకు దుండగంలో భాగం పంచిపెడతాడా ... ? ఇంతకు పాల్పడిన ... ఈ నా నైచ్యఘటనా సంధానంతో నిండిన బ్రతుకు క్షమిస్తుందా ఇహ ప్రపంచం ... ఏనాటికైనా సరే ... యుగాంతరాలు గడిచిం తరవాతనైనా సరే – నా హృదయవేదన అర్థంచేసుకో గల ఉదారులు, సత్యాన్వేషులు, మానవజీవిత మన స్తత్వ

వేదులూ పుడతారా ... పుడితే వాస్తారా — ఇప్పుడు నా హృదయంలో పడే పశ్చాత్తాపమంతా...?

మనుష్యుడు ; త్యాగం — కృతజ్ఞత — సేవ — ప్రదరిస్తూంటే...ఇహలోకం...దీన్నంతా, ధిక్కారం, స్వార్థం,స్వ అవివేకంగా మార్చి — ఆతడు బ్రతికివుండగానే వ్యాఖ్యానిస్తున్నారా? ఇదేనా ఇంతమైత్రిచేసి కర్ణుడు పొముకున్నది...?

భార్య:— ఊరుకోండి ... ఎందుకు బాధపడతారు — ? నేను భరించలేకుండా వున్నాను.

కర్ణు:— ఇందుకే...ఇంత దుష్పరిణామాన్ని ఊహించుకొనే కాబోలు ద్రోణాది పవిత్రబ్రాహ్మణ హృదయాలు మా కలయికను చూడలేకనే ఆనాడు యేవగించుకున్నవేమొ — మా కలయిక మాకే కాక జగత్సంక్షోభకారణంకూడా కాగలదని ఇందుకే అంత ఆక్రందనపడినవేమో ... అబ్బః అబ్బః... ... (పడబోతాడు)

భార్య:—అయ్యో! నాథా! నాథా! (చేతులుమీద పట్టుకొంటుంది)

( తెర )

# కర్ణధారి

## ౨ వ రంగము



(యుద్ధరంగం — కర్ణుడు సేనాముఖంలోనిలిచి తేరిపారచూస్తుంటాడు)

కర్ణు:— అహో! మగధ పౌండ్రాధీశ్వరులారా! శంకిస్తారేమిటి — ? మీ ఏనుగుబలమంతా ఒక్కసారి భీషణఘీంకారం చేస్తుండగా శత్రుసేనలపై తరుమండి. ఎవరది? మిట్ట మధ్యాహ్నమైం దంటున్నారా — మరీ మంచిది. సర్వగ్రహాధిపతియైన చండాంశుడు తన సహస్రగ్రీష్మకిరణాలతో చేసే తోడ్పాటు సామాన్యమైంది కాదు. ఈ నాడే — ఈ కర్ణుని ఆధిపత్యంలోనే గ్రహాధిపతులందరికీ ప్రముఖ వీరుల రక్తతర్పణాలిచ్చే భాగ్యం అందరికీ లభించేదికాదు.

నేను ప్రత్యేకంగా ఉటునుంచే ద్రుపదసైన్యాన్ని, కవలనూ, ద్రౌపదీ కుమారులనూ చుట్టవేస్తాను. సార్వభౌమా! అదుగో! అదుగో! ధర్మరాజు. ధర్మనందనుడుకూడా యుద్ధరంగమున కురికినాడు. బలే! ధర్మబలం చాలలేదేమో, పాపం! తనబలంకూడా చూపిత్తామని వచ్చినట్టున్నాడు. కర్ణపర్వానికిది నేత్రపర్వం చేతాము.

ఇహ విక్రమించు ఆయన మీదికి. ప్రత్యర్థులు స్వాయముగా కలుసుకుంటున్నారు. ఇప్పుడే ఆట రక్తి కట్టటమో — ఆటే కట్టడమో చూపింతాము.

ఎక్కడున్నాడు ఆ పార్థుడు, పార్థసారథీని— అర్జునా! ఆగు. భీష్మద్రోణుల ప్రచండ కోదండ పాండిత్యానికి మతి

పోయి కపటోపాయంతో— కాళ్ళబేరంతో సరిపెట్టుకున్నావు. కర్ణునిదగ్గర ఆ దుర్నయాలు ధర్మద్రోహాలు సాగించలేవు— ఆ అక్రమ చరిత్ర ఈ కురుక్షేత్రపు మట్టిగడ్డల క్రింద మాటు మణిగి పోతుందనుకున్నావేమో— నీ తాంత్రికమయినవిజయ కాంక్ష యెవరికీ తెలియకుండా ఈ పారే నెత్రుటేరుల్లో ఇట్టె కొట్టుకుపోతుందీ, నన్ను మహామహుడనుకొంటారని భ్రమపడు తున్నావేమో? ఆలా జరుగదు.

శా. తారాడున్ పెను త్రాచులై, యుగయుగాంతంబైననున్, నీ చరి
త్రారామమ్ములలో— శిఖండికిని చాపై భీష్మునిన్ గూల్చుటల్
ఆరాటంపడి పచ్చబద్ధముల ద్రోణాచార్యు భంగించుటల్
ఔరా! లోకము కన్నుమూయుదువె, పార్థా! ధర్మపన్నాలతో
కర్ణునిముందు మీ దుర్నయాలకు ఆస్కారం లేదు.

నిర్ణయాలకు నిలువనీడ లేదు. ధర్మం మాటల్లో కాదు. ఆధర్మమేమిటో— ఆ దర్పమేమిటో నాముందు తేల్చుకోవాలె. నీ సారథి జన్మచే క్షత్రియుడైనా త్రాగింది గొల్లపాలు— ఇప్పుడు నీశౌర్యం అల్లరిపాలు— అలనాడుకుమారాస్త్రవిద్యా ప్రదర్శనమప్పుడు నీవు చూసింది కేవలం ప్రదర్శనం మాత్రమే. ఈనాడు నిదర్శనంచేస్తాడు కర్ణుడు. జాగ్రత్త... అదుగో కపికేతనం. కృష్ణా! ఇహ ఈ కపికేతనాన్ని ఎగిరించలేవు.

ఉ. ఆలమటన్న బొంగరములాటయొ, పిల్లనగ్రోవి పాటయో
తేలును నేడు— వాడు— గడితేరిన గాండివధారియేమొ! గో
పాలుడు గోవు కాసపడి పాపము క్రోల్పలి నోటికందె— ఓ
హో! లయకాల భీషణ రణోద్ధతి దాపురమయ్యె నచ్యుతా॥

(నిష్క్రమిస్తాడు)

(3)

( అర్జునుడు కృష్ణుడు ప్రవేశం)

కృష్ణు:— కర్ణా! ఆగు. ఆమాటమీద నిలవాలిమరి.

ఉ॥ అలమటన్న బొంగరములాటగ— పిల్లనగ్రోవి పాటగా
తేలునులెమ్ము, పీడుగడి తేరిన గాండివధారి సుమ్ము— భూ
పాలుడు దేనికాసపడి ప్రాణము గోల్పడు చెప్పకొమ్ము— గో
పాలునిబట్టి గోవను నెపంబున క్రోల్పులి మ్రింగు లోపలన్॥

అర్జు:— కృష్ణా! దానికేమి— అతడన్నమాట విన్నావుకదా— భీష్మ
ద్రోణులను గూల్చిన నెపం మా శౌర్యానికి అపవాదం కాదం
టావా?

కృష్ణు:— అది శత్రుపక్షంచేసే వ్యాఖ్యానం అర్జునా! అడుగడుగునా
యిలా శంకించడం నీమనోదౌర్బల్యం.

అర్జు:— శిఖండిని ముందుంచుకుని...

కృష్ణు:— ముందుంచుకొమ్మని భీష్ములే చెప్పారు.

అర్జు:— ధర్మనందనుడు వెళ్ళిప్రార్థించినప్పుడు గదా—

కృష్ణు:— ఔను, అప్పుడే— అంతే! వారు భీష్ములు ధర్మాత్ములు
కాబట్టి సరిపోయింది. ఇదే కర్ణుణ్ణి, దుర్యోధనుడిని వెళ్ళి అడ
గండి— విరాట ద్రుపదుల సహా భూచక్రమంతా కదిలివెళ్ళి
కాళ్ళవేళ్ళబడి యాచించండి, యుద్ధం ఉపసంహరించుకుంటా
రేమో—?

భారత ప్రజానీకానికి బలిపీఠంగా సంతరించిన కురుక్షే
త్రంనుండి ఒక్క అంగుళమైనా వెనక్కు వెళతారేమో,
అడగండి— లేదు— మీరే వెనక్కువెళ్ళుతామన్నా మీవెంట
బడి వేట్లాడి, మీ కండలుచీల్చి కాకులకు వేస్తామంటారు
గాని...

అర్జు:— కాబట్టి- మేం భీష్ములను అర్థించడం ధర్మమేనంటావా?

కృష్ణు:— నిస్సందేహంగా. మీరు అర్థించడం ధర్మమే- ఆయన అంగీకరించి ఆత్మార్పణం చేయటంకూడా ధర్మమే-

అర్జు:— ఆ మాత్రానికి వారు యుద్ధంలో ప్రవేశించడం దేనికి?

కృష్ణు:— వెర్రివాడా! భీష్ములంటే ఏమో నీకు బాగా తెలియదు. బ్రహ్మరుద్రేంద్రాదులు ఎత్తివచ్చినా నిలువరించగల ప్రపంచవీరవిధాత భీష్ములు- ధర్మనిర్ణేత భీష్ములు-ఆసంగతి దుర్యోధనుడికి తెలుసు గనుకనే ముందుగా మేల్కొని

గీ॥ "కుటిలనీతి విశారద" "కురుకులాబ్ధి
ఘోర బడబాన" లేత్యాది గురుతరంపు
బిరుదులందియు, తా కాళ్ళ బేరమాడి
భీష్మనొప్పించుకొనియెను వెర్రిబావ!

అర్జు:— అలాంటప్పుడు మాకీ ఉపాయాంతరం చెప్పటం, మధ్యలో యుద్ధం విరమించడం- క్షమించాలి- భీష్ములతప్పే అనాలి.

కృష్ణు:— యుద్ధం విరమించడం తప్పా—? భీష్ములకు రక్తదాహం వుందనుకున్నావా? రాజ్యకాంక్ష వుందనుకున్నావా? శాంతి కొరకు చెయిచాచివచ్చిన ధర్మరాజును, దయాధర్మాలు లేకుండా భూమిమీదనుంచి తుడిచి వేయాలనుకున్నారా భీష్ములు?

సాష్టాంగపడిన దీనుణ్ణి దుర్యోధనుణ్ణి చూసి ధనుష్టంకారం, శాంతికాముకుడైన ధర్మనందనునికై ధనుస్సన్యాసం, రెండూ క్షత్రియోచితమైన ధర్మాలుగా భావించారు భీష్ములు

అర్జు:— కాని మా శౌర్యం అనుమానించ దగిందేగదా!

కృష్ణు:— కాదు. నీ శౌర్యాన్నే అనుమానిస్తారా—?

మ. అనుమానింపదు లోకమింతదనుకన్— హాస్యానికైనా గూడ ని
న్ననుమానింపదు శూరలోకమది పార్థా! నిన్ను పాతాళగం
గ నెపంబేర్పడ చూపి రాజునకు గంగానందనుం డందరున్
గనుచుండన్ ముదమందె నీదగు భుజాగర్వంబె పర్వంబుగా.

ప్రతిపక్షంలోనే వున్నా, ప్రపంచాన్నే సవాలుచేసే మహోదాత్తులైనవారి గొప్పతనం అంగీకరించాలి. అలాగే మీరు అంగీకరించారు. ధర్మవీరులైన భీష్ములు, అందులకే ధర్మరాజును సగౌరవంగా ఆహ్వానించి అభీష్టసిద్ధునిచేయటానికై అంపశయ్య నలంకరించారు.

అర్జు:—మరి ద్రోణాచార్యులను అబద్ధమాడి...

కృష్ణు:— అబద్ధమాడించింది నేను. నన్ననలేక గుర్తెక్కి ఖ్య మింగటమెందుకు? నిబద్ధ బ్రాహ్మణధర్మకర్ముడై యుండవలసిన ద్రోణుడే అబద్ధుడైనాడు. అధ్యాపకుడై యుండవలసినవాడు విద్యాపాటవంకూడా చూపించటానికి క్షత్రియులతోపాటు సిద్ధమైనాడు. స్వధర్మభ్రష్టుడైనాడు. ఆ కారణంవల్లనే గురువ్యామోహాం వచ్చి ఒక్క క్షణకాలం నీవు కూడా క్షత్రియ ధర్మభ్రష్టుడవు కావలసివచ్చింది. ఆపాదమస్తకం కంపించేపోయినావు. అంతేకాదు— నీ ధార్మిక జీవన ప్రవృత్తియే కంపించి పోయింది. బ్రాహ్మణుడు ధర్మచ్యుతుడైతే సమాజమంతా చ్యుతమైపోతుంది తెలుసునా?

అర్జు:—కాబట్టి మాకు ద్రోణవధయే ప్రోత్సహించి యుండవలసింది

కృష్ణు:—కూడదు. గోబ్రాహ్మణులను వధిస్తారా క్షత్రియులు? ఒక క్షత్రియులకే కాదు, మనుష్యులందరికీ నిషిద్ధ నీచధర్మం అది.

అర్జు:—నిషిద్ధధర్మాలకు వారే దిగినప్పుడు ...?

కృష్ణు:—నివారించవలసిందే కాని నిర్మూలించకూడదు.

అర్జు:—అబద్ధమాడియా ?

కృష్ణు:—ఆహా ! వేయి ఆడినను తప్పులేదు. అది నీ శౌర్యానికి కళంకం కాదు. ఆత డొక శౌర్యంకలవాడై తే కదా — సేనాధిపతిగా అభిషిక్తుడైనవాడు ఎంత తలవంపుమాట అన్నాడో మరచిపోయినావా ?

గీ. నా సుపుత్రుడు - నాతండ్రి— నాదు కంఠ
మాల— ముద్దుల ముక్కో—పి మడియునేని
శలవు యుద్ధాని కనియెడి శౌర్యశాలి
యుండెనా ? నీదుగురువు ద్రోణుండు దక్క—.

ఉ. ఎంతకసాయివాడు! త్యజియించెస్వధర్మము యుద్ధ ధర్మముఃణా
మంతనమాడి నీదు అభిమన్యుని, నల్వుర కూడదీసి — తా
పంతముబట్టి చంపినను పైబడిచంపక వాని పుత్రునిన్
సుంత తెగించి, చచ్చెననుచో అది మేటి యబద్ధమాయెనా ?

చాలు — చాలు ! ఈ మాత్రం లోకం గ్రహించుకుంటుంది. ఈ దురాగతాని కిది నిజంగా చాలదు. నిన్ను అపుత్రకుణ్ణి చేయడానికి తోడ్పడిన కరకుగుండె కర్ణుణ్ణికూడా అపుత్రకుణ్ణిచేస్తేగాని నిజమైన యుద్ధధర్మం నిరూపితంకాదు. మీయందే నేను అనురక్తుడనై ఎందుకున్నానననే శంకకూడా లోకానికి పట్టుకొని పీడిస్తూంది. ఆ శంకకూడా తీర్చేసమయం ఆసన్నమైతున్నది. అదికూడ తీరుస్తాను.

అర్జు:—ఈరోజు కర్ణుడి బారినుండి బైటపడి తేగదయ్యా ?

( కర్ణుడు లోపల )

సార్వభౌమా ! అదుగో — అదుగో ! ధర్మరాజు ; పోనిమ్ము సైన్యాన్ని – ఒంటరిగా చిక్కినాడు. ఒక్క గదాఘాతం చాలును. ఆట కడుతుంది.

అర్జు:—అయ్యో ! కృష్ణా ... ! పోనిమ్ము మన రధాన్ని. అన్నా ! వస్తున్నాము. ఇంకా ఈ విజయుడెందుకు ? అన్నను కాపాడుకోలేని ఈ బ్రతుకెందుకు ? – చూస్తావేమి, ఆలోచిస్తావేం – బావా ! రధం...

కృష్ణు:—ఆలోచించటంలేదు. అదుగో - భీమసేనుడు వెళ్ళిపడ్డాడు. మత్తగజంవలె విరుచుకుపడ్డాడు. సేన చెల్లాచెదరౌతూంది.

అర్జు:—సేన లెవ్వరికి కావాలెనయ్యా ! చూస్తున్నావా ? ధర్మనందనుని కవచం చీల్చివేస్తున్నారు ... అపాయంలో మునిగి పోతున్నాడు అన్నయ్య – రధం పోనీయ్ బావా ! అదుగో దుర్యోధను డేమంటున్నాడో విను ముందు.

( దుర్యోధనుడు యుద్ధంలోనుంచి )

కర్ణా ! విజృంభింపుము. పాండు నందనులంతా ససైన్యంగా కారుచిచ్చులోబడ్డ మిడుతలదండువలె చిక్కుకున్నారు. అదుగో నీప్రత్యర్థి. (విజయభేరీలు పెద్దపెట్టున మోగుతై.)

కృష్ణు:—ఆ ప్రత్యర్థి కపర్దికే లొంగిపోలేదు. నీకా ? కాలకేయాది రాక్షసులకు కాకోలమై, కంచురధాలవారికి గళపాశమై, ఇప్పటికీ ఆ పార్థసారధికమైన రధమెక్కియే యున్నాడు.

అర్జు:—బావా ! అదంతా గత చరిత్ర ఐపొయ్యేట్టుంది – ఇవాళ ధైర్యం చిక్కబట్టలేకుండా వున్నానయ్యా కృష్ణా !

గీ. ఏమి తేజంబు — అదియేమి— మృత్యుభైర
వోగ్ర తాండవమా? సమస్త గ్రహములు...
ద్వాదశాదిత్యులును వాడి నాదుకొనిర...?
తట్టుకోలేను – కృష్ణ! ఆ ఘాటికింక.

కృష్ణ:—అర్జునా! నీవేనా మాట్లాడేది?

సీ. కొడుకును పదిమంది – పొడిచి చంపగ విని
హృదయాగ్ని సుంత శమింపకుండ
ఛేదించి, ఛేదించి శిశుహంతలకు పుత్రి
శోకంబెదో, చవి చూపకుండ
నిండుచూలాలు కన్నీరు మున్నీరుగా
ఏడ్చు కోడలిని శాంతింపకుండ
హస్తినాపురి కోటయంచులపై ధర్మ
విజయపతాక స్థాపింపకుండ

గీ. నిరుపమానప్రచండ గాండీవముక్త
విద్విషద్ద్రావపావకోద్వేలమైన
అలుగుచివరల విషజిహ్వాం కాసలంబు
చల్లబడి చచ్చుపడెనె కవ్వడికి నేడు?

అర్జు:—పరమాప్తుడవు, పరమాత్ముడవు — నీవురథంమీద వుండగా నాకేమి భయం?

గీ. తోకదొక్కిన పెనుత్రాచు, దోవగాచి
తిరిగి తిరిగి కాటందుకే ఎరుగుగాని–
చల్లబడి చచ్చుబడె నన్న జాడ గలదె?
దారిపైగా నదల్చుము తేరు కృష్ణ!

(తెర)

# కర్ణధారి

## 3 వ రంగము



( యుద్ధరంగంలో ప్రవేశించటానికి కర్ణుడు ఆయత్తపడుతూంటాడు - బ్రాహ్మణుడువేషం దగ్గరగా కనిపిస్తాడు. భార్య ఓరగా వినటం నటిస్తూంది )

బ్రాహ్మ:—అంగరాజా! శంకిస్తున్నట్టున్నావు- నీ వొక మహోదాతవని అంతా చెప్తూంటే ఆశపడివచ్చాను. ఆ ఉదారత నీకు లేనప్పుడు పోనీ ఊరుకో-

కర్ణు:—శంకించటల్లేదయ్యా ఈ కవచకుండలాలు శరీరంతో కలిసి యున్నవే, శరీరం కోసి యివ్వవలెగదా...

బ్రాహ్మ:—సరే, సరె, తెలిసింది. ఇంత శరీరవ్యామోహం వున్న వాడివి నీవేం దానం చేస్తావు-? దానకర్ణుడంటే నిజమేనేమో అనుకున్నా- అసలురహస్యం నాకేం తెలుసు? బాబూ! శిబి చక్రవర్తిగారి కథంటూ ఓటివుంది. విన్నావో లేదో?—

కర్ణు:—అయ్యో! వారు మహానుభావులు- నాశంక, అదికాదు. కత్తితో కోసేటప్పుడు కవచం చినిగిపోతుందేమో, దాన మిచ్చేదిగదా అని- అంతమాత్రమే.

( భార్య ముందుకు వచ్చి )

భార్య:—బ్రాహ్మణోత్తమా! కవచకుండలాలు అర్థిస్తూన్నారా? అయ్యో! అవి వారి శరీరంతో కలిసివున్నయి. చూడండి. మీకా దానానికేమీ అభ్యంతరంలేదుకాని ప్రాణం సంగతి

ఆలోచించ లేదా? మహానుభావా! మీకోరిక ఉపసంహరించు కోండి-

బ్రాహ్మ:—ఓ అవశ్యం- ఏం నాయనా!

భార్య:—మీకు తెలీటల్లేదా ఇది ప్రాణాపాయకరమైందని. అంత నిర్దాక్షిణ్యంగా వారినే ఈప్రశ్న ఎందుకు వేస్తారు?

కర్ణు:—దేవీ! ఏమిటీ- అలావారిమనస్సు నొప్పిస్తావెందుకు? ఎన్నడైనా నా దానవ్రతానికి అభ్యంతరంచెప్పావా?

బ్రాహ్మ:—అభ్యంతరం ఏముంది- ఆదుకొంటూంది వ్రతదీక్షితుణ్ణి.

కర్ణు:—క్షమించండి. ఆమెసహాయంనాకు పూర్తిగావుంది- ఇదిగో శస్త్రం మహాత్మా! జాగ్రత్తగా చీల్చి తీసుకోండి.

భార్య:—అయ్యో! ఇదేమిటండీ! శరీరంకోసి ఇస్తారుటండీ - మీ శరీరంతో ఈశరీరం- మీ ఆత్మతో ఈఆత్మ, వేరుపడి వున్నయ్యా? పరమసాత్వికులుగా భాసించే బ్రాహ్మణజాతి, దయామూర్తులై వుండాలిసిన బ్రాహ్మణులు స్వయంగా ఇంతటి కఠోరపరీక్షకుదిగితే ఇహ ధర్మం ఎక్కడుంది-? ధర్మం నశించిపోయింది. సమస్త ధర్మాలకు ఆధారభూతమైన శరీరాన్ని, ఇప్పుడు ముఖ్యంగా శౌర్యలక్ష్మీబాహుపరిష్వంగానికి సిద్ధమై యుద్ధానికి పోతున్న ఈ శరీరాన్ని రణధర్మ- స్నేహ ధర్మాలను సమీకరించుకున్న ఈపవిత్రసుందరశరీరాన్ని... భంగపెట్టి, చీల్చి శీర్ణంచేసి దానమివ్వాలిసినపనిలేదు ... ఈ వదాన్యతలో అర్థంలేదు ప్రభూ!

కర్ణు:—పిచ్చిదానా! ఈయన యెవరో అసామాన్యుడుగా తోస్తున్నాడు!

భార్య:—ప్రభూ! బాగా ఆలోచించండి —

గీ. రాయబారము నపుడు తిరస్కరించి
స్వామికి విరోధు లైతిరి ... సమరకేళి
కోరి కవచకుండలములు గోసియిచ్చి
ఇప్పుడిక రాజునకుగూడ తప్పుజేసి
ఎంతటి విరోధులౌదురో ఎరుగవలదె ___ ?

బ్రాహ్మ:—ఏమమ్మా ! మీ చర్చ యిప్పుడు ముగిసేది కాదు. ఐనా ఒక్కమాట చెప్పివేస్తే పోయ్యేవాడికోసం ఎందు కింత బాధపడతారు ?

( తెరలో భేరీ ధ్వనులు )

అవిగో యుద్ధభేరీలుకూడా వినవస్తున్నాయి. నీ, ప్రాణమేమో కాని, హటాత్తుగా ఏ బాణమన్నా తప్పిపోయి గుండెకు తగులై నాప్రాణం పుచ్చుకొన్నవాడివైతావు. అసలె గుండె జబ్బు వాణ్ణి కూడాను.

భార్య:—మహాత్మా ! కొంచెం యీ యుద్ధాంతంవరకు వేచివుండ గూడదా ?

బ్రాహ్మ:—ఓ, ఇది మరీబాగుంది. పంచాంగం చూసుకోనన్నా రాలేదు తొందరలో. యుద్ధంలో కర్ణుడుంటేగదా కవచానికి దేవులాడేది ?

భార్య:—అయ్యో యెంత అనరానిమాటాడితివయ్యా !

మ. ఆశాపాతకుడైన నీ వెవరవయ్యా ! బ్రాహ్మణా ! దోసకా
రీ ! శాంతింపుము, అర్థివై ఇటుల నశ్లీలంబులం బల్కి నా
ఆశాదీపము నార్పివేసెదవటయ్యా ? ఇంత కక్కుర్తివై
పాశంబున్ మెడజుట్టినట్లుడుగ మా ప్రారబ్ధ మెట్లున్నదో !

కర్ణు:—దేవీ ! (మంధలిస్తాడు) నేడు కవచకుండలాలుకాదు యుద్ధం

చేసేది - కర్ణుడు. కర్ణుడు సార్వభౌముణ్ణి అన్యాయం చేయటం లేదు. దానవ్రతానికి అన్యాయం చేయబోడు.

భార్య:—ఇంతటి పరీక్షకు తలవొగ్గుతున్నారా ప్రభూ ...నాప్రభూ! (కన్నీళ్ళు పెట్టుకొని దగ్గరకుపోయి మొహంలో మొహంపెడుతుంది.)

కర్ణు:—దేవీ ! పరీక్షే వ్రతానికి ఫలం - జీవితం సఫలం కావటానికీ- స్నేహం సఫలం కావటానికీ రెంటికీ కర్ణుని శరీరమే పణంగా పెట్టబడింది. రణము మారణమాత్రమై ముగిసిపోతుంది. దానం అలాంటిదికాదు. దానము మోక్ష సంధానము. అంత కన్నను యిదేపరిధానం. ఈ విధానమే శ్రేష్టమైనదని ఈ బ్రాహ్మణోత్తముడు నన్ననుగ్రహిస్తున్నాడు. ఎందుకు శంకిస్తావు ?

ఇదే నీవు నాకు తోడ్పడాలిసిన తరుణం —
మన ఉభయుల రుణం దీర్చుకొందాం. మహాత్మా! ఆలస్యం చేయక కవచకుండలాలు స్వీకరించండి. యుద్ధారంభం కాబోతున్నది...

[ బైట ]

అంగరాజా ! సైన్యాలు సిద్ధంగా వున్నయి. ఇక తాము శంఖంపూరించాల్నని సార్వభౌముల ఆజ్ఞ ఐంది...

కర్ణు:—అయ్యా! కానివ్వండి...( ప్రతీహారితో ) వస్తున్నాననిమనవి చెయ్యరా...సారథిని రథమాయత్తంచేసి తీసుకొనిరమ్మను. వెళ్లు.

బ్రాహ్మ:—నేనై తీసుకోటానికి నిన్నునేను బలాత్కారం చెయ్యటల్లేదే-? అలాతీసుకోకూడదు కూడాను. నీకీర్తిలో సగభాగం పంచుకునే నీ భార్యయే ఆపనిచేయవలసివుంది.

భార్య:—నన్నే వారిశరీరం చీల్చి ఇవ్వమంటున్నారా... బ్రాహ్మణోత్తమా! చందనచర్చలతో సపర్యల్లు చేయవలసిన

ఈచేతితో శస్త్రప్రయోగం చేయమంటున్నారా? మీ రెవ్వరో ముందు చెప్పండి మహాత్మా? మీకు దయలేదా? దాంపత్య మాధుర్యం ఎరుగరా మీరు. చెప్పండి. మీరెవ్వరో? మీరు మానవులేఐతే మేము తోటి మానవులం. దేవతలే ఐతే దేవతలు కరుణా స్వభావులు గదయ్యా...

కర్ణు:— దేవీ!

గీ. వారి కరుణాప్రసాదంబు వలదు నాకు
వలదు కీర్తియు, భోగాలు వలదునాకు
తను ధన ప్రాణమాదిగా ధారవోయు
దానమే నాకు జీవిత ధర్మ మబల!

మానవజన్మ ఎత్తినవారంతా తరించాలంటే, దానం చేసి తీరాలి.

ఆదానం నేడు పరీక్షాసాధనంగా ఉపయోగించుకుంటున్నాడు ఈ బ్రాహ్మణోత్తముడు. ఈ దానంతోపాటు ప్రాణప్రదానమే చేసుకోవలసిఉంటే ఇంతకన్నా కావలసిందేముంది. ఏవిధంగాచూచినా ఈ శరీరం అవాంఛనీయమైందే. ఐతేయుద్ధమే ఆగిపోవలసి వస్తుందేమోనని చూస్తున్నాను.

భార్య:— సార్వభౌముడు మీరుచేసే ఈదానాన్ని ఇప్పుడు హర్షిస్తారా? వారికి తెలిస్తే...

కర్ణు:— తెలిస్తే మరీమంచిది. హర్షిస్తారా అన్నదే సందేహం. హర్షించాలి. ఈశరీరం సాధించి పెట్టే దానికన్నా, శరీరపరమార్థం సాధించే మహత్తరమైన ఫలం ఆయన కింకా ఉపకరిస్తుంది. దాన్నే ఆయనకు ధారపోస్తాను. ఆలస్యమైపోతూంది. ఉ! శస్త్రం తీసుకో... తీసుకోవాలి మరి...

(భార్య శస్త్రం తీసుకుంటుంది. చెయి వణకి శస్త్రంజారిపడిపోతుంది. దుఃఖంతో]

నాథా! నేనీపని చెయ్యలేను. నామనస్సూ, అంతకన్న నా చెయ్యీ వణకిపోతున్నయి. ప్రభూ! నేనీపనిచేయలేను. సుందరమయిన మీ వక్షస్థలాన్ని శస్త్రంతో... అబ్బా... బ్రాహ్మణోత్తమా! నాకు పతిభిక్ష—పతిభిక్ష తండ్రీ! (ఏడుస్తుంది. ఆయన కాళ్ళమీదపడుతుంది.) వృషసేనుడు వస్తాడు యుద్ధాయత్తుడై]

వృష:— అమ్మా ఎక్కడున్నావు- తండ్రిగారెక్కడ- ఏమిటమ్మా ఏడుస్తున్నావు? తండ్రీ ఏమిటాలస్యం? అయ్యా! తామెవ్వరు? తండ్రీ! ఈ బ్రాహ్మణుడు విచారపడుతున్నాడెందుకు? నాతో చెప్పండి మహాత్మా! ఏంకావాలి.

కర్ణ:— నాయనా! ఇటురా. (కావిలించుకుంటూను) యీ క్లిష్టసమయంలో నీవునన్నుద్ధరించాలి, నాయనా! నీవు... (గాద్గదికంతో) పుత్రుడవైనందుకు—

భార్య:— పుత్రుడవైనందుకు వారి వక్షస్థలం చీల్చి రక్తమయం చేయమంటున్నారురా. కవచకుండలాలు దానంచేయాలిటరా వారు. తండ్రిగుండెపై పుత్రుడు కత్తిసారించాలిటరా నాయనా! ఈఘోరం అంగీకరిస్తావో, ఆపుచేస్తావో. దీన్నే మీ తండ్రి పుత్రధర్మం అంటున్నారురా తండ్రీ!

కర్ణ:— దేవీ! జాగ్రత్తగా కొయ్యమని చెప్పటానికిమారు నీవుఅంత పెద్దచేసి చెప్పటం వాణ్ని విముఖుడినిచేయించడానికా? శరీరరక్ష- దానదీక్ష, రెండు కావాలనే నేనంటున్నాను. శరీరరక్ష కొడుకు ధర్మంకాదంటున్నావా: కొడుకు ధర్మం ఇంతమాత్రంతోనే తీరేదికాదు.

మ. కొడుకే జీవిత భాగ్యరేఖ- కొడుకే ఘోరాగ్ని కుండంబులో
బడువేళన్ యమపాశ బంధదళనప్రాజ్ఞుండునై- కర్తయై
విడుచున్ గాదె తిలోదకాలు- కొడుకే ప్రేరేచి తా స్వర్గపున్
గడియల్ తీయగలట్టివాడు గదవే కాంతా! భయంబేటికిన్॥

బ్రాహ్మ:— అమ్మా! శరీరం శిథిలమైపోవాలని నేననటంలేదు. శరీరధారులై నిలిచియున్న సర్వ కురు వాహినులకు అతిరథమహారథులకు ఈ కర్ణుని శరీరం పర్వతంలా ముందు నిల్చొన్నుండాలనే కోరుతున్నాను.

వృష:— అమ్మా... పవిత్రోదకాలు తీసుకురా... తండ్రిగారిజీవితానికే ప్రియమైన ఈవ్రతం మనమే అడ్డగించడమా? వద్దు. తల్లీ! వెళ్ళు. తండ్రిచేస్తున్న దానానికి ఉదకప్రదానంచెయ్యి. దానంచేసే మహోత్కృష్టమైనవారికి ఉదక ప్రదానం చేయటమే కష్టమా... రాజాధిరాజులను వదిలివేసి తండ్రిగారినే ఈ బ్రాహ్మణుడు యాచించటం మనం గర్వించవలసిన విషయం గాదటమ్మా?

కర్ణు:— బలే... బలే కుమారా! నాతండ్రీ! నిన్ను కన్నందుకు నన్ను ధన్యుణ్ణి చేశావు.

భార్య:— నాయనా! ఆలోచించే మాట్లాడుతున్నావా. తండ్రివక్షస్థలం— నీవు... నీ చేతుల్తో... బాగా ఆలోచించు.

వృష:— అమ్మా... అమ్మా...

భార్య:— ఊరుకో... తండ్రి నెత్తుటితో తడిసిన నీచేతులు అమ్మ కన్నీళ్ళతో కడుక్కోవలసి ఉంటుందని ఆలోచించుకో. ఆలోచించుకో. నాబిడ్డా! తొందరపడకు. ఈపని చెయ్యవద్దురా నాబాబూ! [వృషసేనుడు గూడా తల్లితోబాటు దుఃఖం పట్టలేక పోతాడు]

వృష:—అమ్మా ! ... అమ్మా! (కన్నీళ్ళతో) ఒక్కమాట చెబుతా విను. తండ్రిగారు రోజూ నన్ను కూచోపెట్టుకొని యేం చెప్పేవారో నీకు తెలియదా ? నాయనా ! ధర్మకర్మలమధ్య లోపడి తట్టుకోలేక మనుష్యులు కక్కుర్తి పడతారు. నానాక వహ్నుల్లో మ్రగ్గిపోతారు చివరకి. నాయనా ! ధర్మం కఠోరమైంది. ఏమైనాసరే– ఒక్కసారి అన్నమాటకు ఇహ తిరుగుండరాదు సుమా అనికదా చెప్పింది ...

భార్య:—ఐతేమాత్రం అలాంటివారినే పట్టుకొని ఇంకో మనుష్యుడు నిర్బంధంలోపెట్టి ... పరీక్షకుపెట్టి ... బాధపెట్టి ...

వృష:—అమ్మా !

గీ. బాధకు – పరీక్షలకును – నిర్బంధములకె
ధర్మము జ్వలించు – ఆజ్వాల మర్మభేద
న మొనరింపగ అజ్ఞాన తిమిరమణగు
అపుడె దైవాంశసంభూతుడగును తల్లి.

భార్య:—ఎవరు చెప్పారురా ఇదంతానీకు ... నాబాబూ ... ఇలాదగ్గరకురా ... ఇహచెప్పు ... (చెంపలు నిమురుతూ) నన్నేంచెయ్యమంటావో నా చిట్టితండ్రీ ఇహచెప్పు – వింటాను.

వృష:—అమ్మా! అందరికీ ఆత్మధర్మం నిర్వహించుకోటం సాధ్యం పడదు. దాన్ని లాంగదీసుకుని మాతండ్రి ఇప్పుడు దైవాంశులౌతున్నారు. అలాంటి తండ్రికి, అమాయిక పతివ్రతవైన నీకు పుట్టినభాగ్యంవల్లనే నేనీపనికి సంతోషంగా అంగీకరిస్తున్నాను. నీవూ అంగీకరించు తల్లీ !

భార్య:—ఏమో ! నీకు జవాబు చెప్పలేనురా తండ్రీ ! రక్తమయం కాబోయేవారి శరీరం చూడలేనురా – నేను దుర్బలురాలను ఆడదాన్ని ... అన్నిటికన్నా ...

వృష:—అమ్మా ! విచారించకు - ఆ గండరగండకు ఎంత సత్వ ముందో ఆడగుండెకు నీకు అర్థం కాదమ్మా -

గీ. పగతురను రొమ్ము సాచి పై బడినవేళ
బంటుమగలెల్ల శరపరంపరల గుమ్మ
అరుల బొరిగొను కొదమసింగంబు తల్లి !
అయ్యకిది యొక లెక్కగాదమ్మ నేడు.

కర్ణు:— కానిమ్ము నాయనా ! ఇప్పటికే చాలా ఆలస్యంఐంది. యుద్ధారంభం అయింది.

(వృషసేనుడు శస్త్రంతో కవచకుండలాలు ఛేదిస్తుంటాడు. కర్ణుడు బాధ నటిస్తాడు.)

వృష:—ఐపోయింది ... ఒక్కక్షణం ... తండ్రీ ... కొంచె మోర్చు కోండి.

బ్రాహ్మ:— ఓహో ! ఓహో ! !
"కృతయుగే బలిర్దాతా ... త్రేతాయాం రఘునందనః ...
ద్వాపరే సూతపుత్రశ్చ ... ఓహో !

కర్ణు:—(అలసిపోతాడు) రండి ... ఇదిగో తీసుకోండి బ్రాహ్మణో త్తమా ! దేవీ! జలము ... (ధారాదత్తం చేస్తూ) — ఇందే మైనా విశేషముంటే — ప్రతిభ వుంటే ఇది నాదికాదు. భారతదేశమంతటిదీ — దీన్ని మీరు భారతీయజాతి జీవన చిహ్నంగా గ్రహిస్తే చాలు—
( యుద్ధపుదుస్తులు వేసుకొంటూ శంఖారావం చేయాలి )

బ్రాహ్మ:—ధన్యోస్మి ! ధన్యోస్మి ...

( కర్ణుడు వెళ్ళిపోతూండగా )

బ్రాహ్మ:—కర్ణా! యిదుగో - ఈ అస్త్రం తీసుకో ... ఇది శక్తి వంతమైన అస్త్రం - ప్రాణాపాయకరమైన అవస్థలో ఎవరో ఒక్కరిపైన మాత్రం ఉపయోగపడుతుంది. )

కర్ణు:—దానమిచ్చినందుల కిది ప్రతిఫలమా ? వద్దు - వద్దు...

బ్రాహ్మ:—ప్రతిఫలంకాదు. బహుమానం...

[ కర్ణుడు నిష్క్రమణం ]

వృష:—తాము సంతోషించటమే తండ్రిగారికి బహుమానం.

బ్రాహ్మ:— (కుమారుణ్ణి దగ్గరకుతీసుకొని ) ఆయన పుచ్చుకోడు గాని నీవే దీన్ని దాచిపెట్టివుంచు. తప్పకుండా వాడుకోమన్నా ననికూడా చెప్పు.

[వికర్ణుడు, తల్లీ నమస్కరిస్తూండగా బ్రాహ్మణుడు వెళ్ళిపోతాడు.]

వృష:—తామెవ్వరో శలవీయండి. ఇంత కఠోరపరీక్ష చేసికూడా కరుణామయులవలె కనిపిస్తున్నారు.

బ్రాహ్మ:—నేనా ... (నవ్వి) నేనెవరైతే యేంనాయనా ? మీ కన్నా అధికుణ్ణె ... కాని మీనాన్నయే అధికుడనిపించుకుంటాడు ఈ దానంవల్ల ... (వెళ్ళతాడు)

వృష:—అమ్మా! చూస్తున్నావా! ఏదో వెలుగు ... ... వెలుగు వెంటాడుతూంది. ఈయనయెవరో దేవతవలె నున్నాడు.

(తెరలో)

(అర్జునుడు విజయశంఖం పూరిస్తాడు. యుద్ధ కోలాహలం—)

(వృష:—(మూలుగుతూ) అబ్బా! ... తండ్రీ!! ... ... ఎక్కడున్నావు ? ...

చచ్చి - చచ్చి - అర్జునుని బాణపరంపరలకు తట్టుకోనలేక వృషసేనుడు మరణించాడు.)

# కర్ణధారి

## ౮వ రంగము



( తెరముందు ఈక్రింది ప్రకటన చేస్తూ సైనికుడు వెళ్తూంటాడు. కృష్ణార్జునులు ప్రవేశించి వింటారు)

సైనికుడు:— పాండవసైన్యాలు విజయవంతంగా పోరాటంచేసినై. అభిమన్య కుమారుణ్ని దుర్మరణం పాలుచేశిన కర్ణుడికి పుత్రవియోగం సమకూర్చారు. వృషసేనుడు మరణించాడు. అందరు సైనికులు ఈరాత్రి తమతమ గుడారాల్లో మహోత్సవం చేసుకోవాల్నని పాండవ సేనాపతి ద్రుష్టద్యుమ్నులవారు ఆజ్ఞయిస్తున్నారు. రేపు కర్ణ పర్యాంతం చేస్తారని సేనాపతులు నమ్ముతున్నారు.

(అర్జునుడు ఆలకిస్తూంటాడు)

అర్జు:— ఆగండి- ఏమిటా కోలాహలం-!

కృష్ణు:— ఆ కోలాహలం నీకిష్టంలేదా అర్జునా?

అర్జు:— ఇదేమి ఘనకార్యమా- వీరులు సాధించే విజయాలు ఇలాటివేనా? బావా! ఇవ్వాళ నామనస్సు చాలా వ్యధపడుతోందయ్యా.

కృష్ణు:— ఎందుకు? గాయాలు బాగా బాధిస్తున్నయ్యా?

అర్జు:— హాస్యం చెయ్యకు. ఏమరుపాటుగా వేసిన బాణం పాపం! వికర్ణునకు తగిలిందయ్యా. ఎంతఘోరం జరిగింది యీచేత్తో. ఎవరఱునావింటే అర్జునుడు—

కృష్ణు:— బాగా ప్రతిక్రియచేశాడు, పగసాధించాడు అని ప్రశంసి స్తారు.

అర్జు:— ప్రతిక్రియ చేసినా— పగ సాధించినా కర్ణుని పైనగాని పసి వాడిమీద బాణప్రయోగం చేశానే...

కృష్ణు:— ఇలాగైతే నీవు యీ యుద్ధంచేసినట్లే. రేపు కర్ణుడు పుత్ర మరణ వ్యధాక్రుద్ధుడై విజృంభిస్తాడు. న్యాయాన్యాయాలు, దయాధర్మాలు ఆలోచిస్తాడేమో చూతువుగాని. సర్వం తెలి సియే యుద్ధానికి వస్తారు యోధులంతా— కాని బంధువధలు ఒకరిని కృంగదీస్తయి. ఇంకొకరిని పొంగులెత్తిస్తయి. పొంగె త్తి పోరాడినవారే భువన విజయులౌతారు. పార్థా! ఈ నిర్వే దాలలోనుంచి నిరుత్సాహం, నిరుత్సాహం నిర్మూలనానికి దోవలు చేస్తుంది. సరిగాని— హాయిగా,నిర్విచారంగా విశ్రాంతి ఈరాత్రి తీసుకో.

అర్జు:— ఒకవంక గాయాలబాధ, అంతకన్నా లోపల యీపశ్చా త్తాపం— నన్ను మతిలేకుండా చేస్తున్నవి కృష్ణా! అధర్మం విజయచిహ్నంకూడా కాదుగదా...

కృష్ణు:— అధర్మంకాదు. కాకపోగా స్వధర్మం నిర్వహిస్తున్నావు. తెలిసిందా?

స్వధర్మ నిర్వాహణంలో స్వార్థంవుంటే అపజయం వుంది. వృషసేనుణ్ణి చంపటంలో వీరత్వ ప్రదర్శన ఏముందని నీవే అన్నావు. వీరత్వ ప్రదర్శన కాంక్షకాని, విజయకాంక్ష గాని లేకుండా ఎవరు ప్రవర్తిస్తారో వారికే విజయం. విజయ లక్ష్మి కరగ్రహణాపేక్ష కోరితే వస్తుందనుకున్నావా? ఆమె కౌగింటిలో చిరుహాసంచేసే విశ్వవిజయా విశ్రాంతి నీలో ప్రబుద్ధమై రావాలి అర్జునా—

కర్ణుడు ఆ సుఖానుభవం ఊహించుకునే- ఆ స్పర్శకు అరుణిలు సాచుకునే ఇంత విఖ్యాతి ఆర్జిస్తున్నాడు. కర్ణుడు సార్వభౌముడిని ఆకర్షించింది ఆమహోదాత్త గుణసంపత్తి వల్లనే- ఆతడు జగద్విఖ్యాత దానశీలుడుగా ముందుకు వస్తున్నది కూడా ఆ గుణసంపత్తి వల్లనే—

ఎందెందరకో ఎందరికోయననేల- ఇప్పుడు ఈరాజరాజుకు తలప్రాణం తోకకువస్తూన్న ఈ ప్రళయమైన యుద్ధం, యుద్ధం వల్లగాని రాజాలని భారత సామ్రాజ్యాధిపత్యం నేను నేనై మీఅందరిపక్షాన చేయిచాచి అర్థించి, అంగీకరించమని అడిగినప్పుడు కర్ణుడు ఒక్క చిరుహాసంతో ఆవలకు నెట్టివేసింధి ఆ ఉదాత్తగుణ సంపత్తివల్లనే...

అర్జు:— రాజరాజు నీచస్నేహాన్ని ప్రధానంచేసికాదా—

కృష్ణు:— ఆసంగతివేరు. రాజరాజు లొంగిపోయినాడు. వాడి ఆ గుణానికే అంగరాజ్యాభిషేకం చేశాడు- ఆగుణానికే అంజలిపట్టి రాజ్యం నిలుపుకోవాలనుకుంటున్నాడు— నీమీాదదూకాల్నని ప్రత్యేకదృష్టితోవున్నది ఆ గుణవిశిష్ఠత వల్లనే...

అర్జు;—కాబట్టి...?

కృష్ణు:—ఎంతటి విశిష్టమైన గుణమైనా సరే నీవు బద్ధుడవు కారాదు. గుణాతీతుడవే కావాలి అర్జునా ! అంతేకాదు ; గుణపాఠాలే నేర్వాలి మనుష్యజాతికి — మనుష్యజాతికేకాదు — మనువే ధర్మశాస్త్రాన్ని వ్రాసుకోవాలి నిన్నుచూసి —

అర్జు:—కర్ణునికే విజయం సుసాధ్యం కాదా మరి — ?

కృష్ణు:— కాదు -

గీ. ఏ మహాదోషమునను నశించిపోవు
ధర్మ కర్మాదినిష్ఠలు - ధైర్య శౌర్య
ధన ధనేతర సామ్రాజ్య దర్పములును
ఆ అహంకార మాతని నావహించె-
ఫల్గుణా ! జయము నీదె- చెప్పంగనేల ?

( తెర )

# కర్ణధారి

## ౫వ రంగము



( రాత్రి మూడో యామం )

(పాండవ సేనాశిబిరం... శ్రీకృష్ణుడు ఆందోళనగా అటూ యిటూ నిద్రపట్టక తిరుగుతున్నాడు. కుంతీదేవి ఆతురతతో వచ్చింది.)

కుంతి:—నాయనా! కృష్ణయ్యా ... కృష్ణయ్యా ... ఎవరా్రి అక్కడ—

ద్వార:—ప్రభూ ...! ప్రభూ !! ...

శ్రీకృ:— శ్ - అత్తయ్య వచ్చారా దయచేయండీ !

కుంతి.—నాయనా ! అర్జునుడేడయ్యా ... ఇవ్వాళ వాడికి బాగా గాయాలు తగిలినవన్నారు ...

శ్రీకృ:—ఆ మూలుగుతున్నాడే ... అక్కడ— లేపకండి— అత్తయ్యా!

కుంతి:—అయ్యయ్యో ! ఒంటినిండా గాయాలు ... కట్లు ... స్మృతి లేకుండా పడున్నాడేమిరా తండ్రీ ! కృష్ణయ్యా ! ఏమైనా సరే - ఎలాగైనా సరే - ఈ యుద్ధం ఇహ ఆపుచేయించాలి. చేయించకపోతే ...

కర్ణుడున్నాడే ... మావాడు. వాడి కొడుకును చంపేశారుట కాదు ...? ఆ దుఃఖంతో అర్జును డంటేనే ఆకాశమెత్తున మంటలు గక్కుతున్నాట్ట కృష్ణయ్యా ! రేపు ఊరుకోడు. ఏమో చెపుతున్నాను మనుష్యోకు — బాగా ఆలోచించు కృష్ణయ్యా ! నీ ఆశీర్వచనమున్నంటేనే విజయం ...

శ్రీకృ:—విజయమో – విలయమో ... పెద్ద ధర్మసంకటం ఓటి అడ్డం వస్తూంది అత్తయ్యా!

కర్ణుడు అపూర్వ తేజస్వి – మహాపురుషకారం — మూర్తీభవించిన ఆ పురుషకారం ఆత్మవిశ్వాసంతో, అచంచలమైన ధైర్యంతో – అనిర్వాచ్యమైన త్యాగబలంతో – ముల్లోకాలెత్తివచ్చినా కబళించివేయగల హుంకారంతో ఎదుర్కొంటూంది– వాడు అర్జునుణ్ణి నూత్రిం వదిలిపెట్టడు.

కుంతి:— వాడు నీకు భక్తుడుగదా– భక్తపరాధీనుడవే నీవు కృష్ణయ్యా! నీవే అలా అంటే ఇహ దిక్కెవ్వరయ్యా?

శ్రీకృ:— అందుకే ఇంతవరకూ పరాజయం లేకుండా జరిగిపోతూంది. కాని కర్ణుడంటే సూర్యుని తేజస్సని జ్ఞాపకం పెట్టుకోండి... సూర్యుడు కర్మసాక్షి. కర్మకు మూలమైన పురుషకారం వాడిలో కరుడుగట్టి ఉంది.

కుంతి:— ఈ సమస్యల్లోపడి ఎట్లా– నాబిడ్డలెట్లా బైటపడుతారు కృష్ణయ్యా!

శ్రీకృ– కర్ణుడుకూడా నీబిడ్డయేనమ్మా.

కుంతి:— ఔను. అందుకే కృష్ణయ్యా... నామతి తిరిగిపోయి మాటాడుతున్నాననుకో– అందుకే– అసలీయుద్ధమే ఆపుచేయించు– బతికిపోతాను.

శ్రీకృ:— యుద్ధమేనా ఆగిపోవటం... ఈయుద్ధం ఆగిపోదు– పోరాదు.

ఉ. మోసముచేసి, భూప్రజల ముందుకుదోసి– అరిప్రకాండ బాహా సముదీర్ణ శాత విశిఖానల కీలల కప్పగించి; పో
రాసను సూదిమోపు మొన యంతయు నీయని క్రూరరాక్షసా
కోశ మడంచు ట్లు సమకూడదు యుద్ధము లేక నేడికన్

ఇది కేవలం కృష్ణార్జునుల యుద్ధంకాదు. కర్మజ్ఞానాల మధ్య జరుగుతున్న బ్రహ్మాండమైన సంఘర్షణ. ఈ సంఘర్ష ణలు మహాకర్షణలై నన్ను రెండూ రెండువైపులా లాగుతు న్నాయి. ఇంతటి పటిష్టములయిన శక్తులు ఇంతవరకూ ఈ ద్వాపరంలోనే తారసిల్లలేదు.

కుంతి:— కృష్ణయ్యా! నీమాటలు నాక్కేమీ తెలియడం లేదు— అయ్యో... కర్ణయ్యా... నాకర్ణయ్య ఇంతగొప్పవాడా. దేవదేవా! నీ అంతవాడు కర్ణయ్య గొప్పవాడంటుంటే లోకం—?

శ్రీకృ:— వాడిసంగతి నాకు బాగా తెలుసు. వాడి అతిలోక పురుషకారం నేనంగీకరిస్తాను ఆ కర్మనిష్టాపటిష్టమైన వాడి మనో వాక్కాయాలకూ నేను ముగ్ధుడనై పోతున్నానత్తయ్యా! కాని—

కుంతి:—ఏమిటో చెప్పవచ్చి ఆగిపోయినావేమి కృష్ణయ్యా! చెప్పు— వాడే జయిస్తాడా... చెప్పు కృష్ణయ్యా!

శ్రీకృ:—(ఆలోచిస్తూ) వాడు — అసలు ఒక కీలకంలో పడిపోయి నాడు పాపం... అహంభావం ... ఇల్లాగేవుండి ఆ కర్మనిష్ఠ సమాప్తం చేసుకోకుంటే మాత్రం— ఇహ ఈ జన్మకు వాడు దానకర్ణుడైనా — శూరకర్ణుడైనా ... శోకోపహతుడు కావలసిందే. విజయంలేదు.

కుంతి:—అర్జునుడంటే మరి...? తెలియకడుగుతున్నాను.

శ్రీకృ:—అర్జునుడా? ఆతడు కర్మాచరణంలో చకితుడౌతున్నాడు; భక్తినిష్ఠ ఇంకా అతనిలో ప్రతిపాదితం కాలేదు.

కుంతి:—ఇహ గత్యంతరం —? ఈ బిడ్డలేమైపోతారయ్యా!

శ్రీకృ:—నన్నేం చెయ్యమంటారు అత్తయ్యా! బిడ్డలు ... ఎవరి బిడ్డలనే సంగతేలేదు. ధర్మమేవ జయతి. ధర్మానికే విజయం-

కుంతి:— (ఏడుస్తుంది) నా బిడ్డలు ధర్మాత్ములుకారా? కృష్ణయ్యా-

శా. కారాధర్మపరుల్, ప్రతాపధనులున్, కారా సదాచారులున్
ఘోరారణ్యములన్ వసించుటకు సంకోచింప రజ్ఞాత వే
షారమ్యాకృతులై ఉగ్రాస్త్రులయి, సర్వంబోర్చుకున్నారు ఆ
ధీరుల్ బిడ్డలు ధర్మనిష్టులయి కాదే చెప్పుమో యచ్యుతా.

శ్రీకృ:—ఆ నిష్టలో ఎంతసత్యముందో ఇప్పుడు తేలాలి. ప్రజలకీ యుద్ధాలతో పనిలేదు వారికి ధర్మాత్ముడైన రాజొక్కడు కావాలి. ధర్మదాష్ట్ర్యాలమధ్య యుద్ధంజరుగుతూంది అనిప్రజ లకు బోధపడింది. ఆ ధర్మరక్షా దక్షుడైన వ్యక్తి కావాలి. అందుకే ప్రజలు యుద్ధంలో పాల్గొన్నారు. లేకుంటే - ఈ రాజులు తరాజుల క్రోధావేశాలకు బలియౌతారటమ్మా ప్రజలు - ?

చ. సమరములోన నెత్తురు వసంతములాడెడు రాజుకోసమై
సమయుదురే ప్రజల్-బ్రతుకు చల్లనిసంతతి చంపుకొందురే-
తమకయిగాక - ధర్మమును దప్పక - స్వార్థము లేక; జన్మమే
సమరముగాగ నెంచెడు విశాంపతి నొక్కనికోరియే కదా!

మీరన్నట్లు యుద్ధమే ఆగిపోవాలన్నా- అర్జునుడే జయించాలన్నా - ఒక్కటే మార్గంవుంది. మీ రిప్పుడు ... ఇప్పుడింకా తొలికోడి కూయలేదు- వెళ్ళి—కర్ణుణ్ణి కలుసుకోవాలి.

కుంతి:—అమ్మయ్యో... వాడు కొడుకుచచ్చి గోడుగోడుమని ఎంత యేడుస్తున్నాడో ... ఎంత ఉగ్రుడై మండిపడుతున్నాడో—

శ్రీకృ:—అందుకే... అదికాదు. ఈ సమయంలో ఒక్కమిమ్మల్ని చూస్తేనే ఏమైనా చేస్తాడు. మీరు వెళ్ళితే ఏదీ కాదనడు.

ముందు అర్జునుణ్ణి తప్పించే మాట తేల్చుకోవాలి. అప్పటికీ రేపు మనం అంతా ప్రాణాల్తో బైటపడతామనేది సంశయం గా వుంది.

కుంతి:—నేనెంత మొండిదాన్నైనా బ్రతుకుతున్నాను కృష్ణయ్యా! లోకం వాణ్ణి సూతపుత్రుడనీ - శూద్రుడనీ నానానిందల పాలుచేస్తే బ్రతుకంతా ఏడుస్తూనేవున్నాను. ఇప్పటికీ- వాణ్ణి సుక్షత్రియుణ్ణి - ఇంత నీచపరచిందాన్ని ... గంగలో పారేసిన కఠినురాల్ని ... ఏమిచేసినా ... ఓహో! నా బిడ్డ ఈనాడు భారత సర్వసేనాధ్యక్షుడుగా - జగదేకశూర శిఖామణిగా - జగద్బాంధవుడైన ఆ మార్తాండుని ప్రతిగా ...
అయ్యయ్యో ... కృష్ణయ్యా! నేనే వెళ్ళి ...

శ్రీకృ:—అత్తయ్యా! నాకు తెలీదనుకుంటున్నారా - మీ బాధ - వెళ్ళాలి ... గత్యంతరం లేదు మరి —

కుంతి:—వెళ్తాను ... నువ్వుచెబుతున్నావుకాబట్టి వెళ్తా - ఆభిజాత్యం పాడుచేసుకొనియైనా సరే -

శ్రీకృ:—తెల్లవారుతూంది చూస్తున్నారా - ? వెళ్ళాలి ఇహ.

కుంతి:—(వెళ్ళుతూ) ఏమొహం పెట్టుకొని వెళ్ళేది - ?
మా కృష్ణయ్యకు తల్లంటే యేమిటో తెలియలేదు. అబ్బా: - నేనే వాణ్ణి ఏమని అడిగేది దైవమా!



(కుంతీదేవి ఏడుపునకు అనుగుణంగా నేపథ్యసంగీతం ... కర్ణుని శిబిరం లోని ఆతనిభార్య పుత్రదుఃఖంలో లీనమైతూంది. )

# కర్ణధారి

## ౬ వ రంగము



( కర్ణుని శిబిరం )

( కర్ణునిభార్య మంచంమీద కనిపిస్తూంది. కర్ణుడు కన్నీళ్ళు తుడుచు కుంటూ అటూఇటూ తిరుగుతున్నాడు)

కర్ణు:— ఎంతకూ తెల్లవారేట్టులేదు ఇవ్వాళ.... యేడ్చియేడ్చి ఈ యభాగ్యురాలి కెల్లాగో కునుకుపట్టింది, ఆ అర్జునుడి మృతక ళేబరం చూచేదాకా నాకు శాంతిలేదు— నిద్రలేదు...

తన సర్వ సువ్రత ఫలాదులను కర్ణుడు సార్వభౌముడికి ధారాదత్తం చేసివేశాడు— అతని సేవావ్రతం సమాప్తమై నట్టే—

ఇక, మనుష్యుడైన కర్ణుడొక్కడు మాత్రం మిగిలి ఉన్నాడు. ఈ మనుష్యత్వంమీద ఎన్ని అభిశాపాలు—అశాంతులు—

భార్య:— (నిద్రలో ఏడుస్తుంది) కొడుకా— నా వృషసేనా... (లేవబోతూ] వాడిని ఒక్కసారి చూపించండి నాకు— నేను భరించలేనండీ ఈదుఃఖాన్ని—

కర్ణు:— (అనునయ పూర్వకంగా) పడతావు— లేవబోకు— చూపిస్తాలే— తెల్లవారనియ్యి. నీకొడుకు కళేబరంపక్కనే—వాడ్ని చంపిన వాని కళేబరం కూడా చూతువుగాని— పడుకో.

వాడు దేవేంద్రుని కొడుకట— మళ్ళీ అదే దేవేంద్రుని దగ్గరికి పంపిస్తారేపు... రేపే—

(భార్య పడుకుంటుంది)

(గద్గదంతో) మాయిద్దరికీ తల్లి ఒక్కతే. (దుఃఖం నవ్వు] మాఅమ్మకు నాదగ్గరకు రావటానికి కూడా అభిజాత్యమే— అమ్మా—! నీమనుమణ్ణి చూడన్నైన చూడలేదుగదె. నీవిష్టవిత్రి హస్తాలు. అందుకే నన్ను గంగలోపారేసినా బతికానమ్మా.

వాణ్ని నీవు ఒక్కసారి చూచి దీవించియుంటే నీ దేవేంద్రుని కొడుకుగాదు— దేవేంద్రుడే దిగివచ్చినా నిలిచిగెలిచే మనుమడు తల్లీ. అబ్బ ... ఈ వేధ నామనస్సును, మేథస్సునూ, బ్రిద్దలుగా సమ్మెటలతో కొడుతున్నదే— ఓహో—తను కన్నవారూ — తనను కన్నవారూ — కరువైపోయిన కర్ణుణ్ణి — నీకొడుకునుచూసి పోవట్టానికేమమ్మా—

నీ కులగౌరవాలు— నీ రాజ్ఞీత్వమూ ఎంతకాలం ఇద్దరినీ కలుసుకోకుండా చేసినవే అమ్మా... (బావురుమని ఏడ్చి కూలబడతాడు]

( అప్పటికి శిబిరద్వారం చేరుకున్న కుంతి]

కుంతి:— నాయనా— వస్తున్నానయ్యా ...

ద్వారపాలకుడు:— [ఆశ్చర్యంతో) ఎవరమ్మా మీరు?

కుంతి:— [తటపటాయిస్తూ) నే వచ్చానని చెప్పరా ... కాదు—ఎవరో యాచకురాలొచ్చిందని చెప్పు. వెళ్ళు.

ద్వార:— యేడ్చియేడ్చి ఇప్పుడే కన్నుమూసుకున్నారమ్మా— తెల్లవారనియ్యి. ఏమిటా కక్కుర్తి—?

కుంతి:— తెల్లవారితే నేను యాచించేదిలేదు. ఆయనయిచ్చేదీలేదు.

కర్ణు:— ఎవరామె. ఇలా లోపలికి పంపించు—

అమ్మా! దయచ్చేయండి- దయామయీ! శెలవీయండి.

కుంతి:— [తనలో] నాతండ్రికి ఎంతనిష్ఠ- ఎంతఓర్పు- దుఃఖమంతా దిగమింగి నాబాబు... ఇప్పుడుకూడా దానప్రదాయకమైన ఆ చేయి చాచియే యాచిస్తాడు.

కర్ణు:— ఏమిటమ్మా శంకిస్తున్నావు- ఏం కావాలో అడుగు-

కుంతి:— నాయనా! ఇలా దగ్గరకురా! వొళ్ళంతాగాయాలు— గొడ్డలివేట్లులాగు పుత్రదుఃఖం- బాబూ- నిన్నునీవే ఓదార్చుకుంటున్నావా? ఆ కళ్ళు ఎంత ఎరుపెక్కినవిరా?

కర్ణు:— మా అమ్మ రాలేదుకదా? ఎవరునీవు? అబ్బ! ఒక్క క్షణం నువ్వు మా అమ్మవైతే బాగుండును.

కల్లోలమై పోయిన నాయీ శిరస్సుపై మా అమ్మ చల్లని చేయిపెడితే కాస్త శాంతి పడేవాణ్ణేమో!

నీ వెవ్వరో వృద్ధరాణి వలె నున్నావు. మహారాణి యాచకురాలెందుకైంది- అమ్మా! ఈ దరిద్రతామూర్తి తమలాంటివారి క్షేమి ఇస్తాడు—?

కుంతి:— నీవు దరిద్రుణ్ణనుకుంటున్నావా-? పిచ్చిబాబువు- ఎవరు అడుక్కుంటారో వారూ దరిద్రులు- నీవు యిచ్చేవాడివి. ఇది యది యనుకోకుండా లేదనక ఇచ్చే వదాన్యతవల్ల నీవు సంపన్నుడవేకాదు .:. భావసంపన్నుడవు, దయాసంపన్నుడవు... గుణసంపన్నుడవురా నాతండ్రీ!

కర్ణు— ( ఆశ్చర్యపడతాడు. ఆమె ఆప్యాయత ... ఆమె సంబోధన చూసి ) ఎవరు నువ్వు—నీ వెవ్వతవో ముందు చెప్పు.

(కర్ణుని భార్య దగ్గరకు వస్తుంది.)

కుంతి:—— నన్నెప్పుడూ చూళ్ళేదయ్యా నీవు ?

కర్ణు:—— లేదు—— పోనీ నీవు చూసివుంటే చెప్పవచ్చుగదా !

కుంతి:—— నేనా —— చూశాను —— అందరికన్నా మొట్టమొదట చూసిందాన్ని నేనే- నీ గులాబీ బుగ్గలు చిరుగుంటలు పడుతుంటే చూశాను. నీ కంఠధ్వనికూడా అప్పుడే విన్నాను—— ఒక్కసారే—— అదే చివరిసారి అవుతుందనుకున్నాను. గుండెలకు దగ్గరగా అదుముకున్నాను- నిన్ను-

(కన్నీళ్ళతో- గద్గదంతో——మాట్లాడలేక వెగుల్చుకుంటూ) అప్పుడు- అప్పుడు నీకు బాగా ఆకలేసింది. బుడిబుడి కన్నీళ్ళతో నా మొహంలోకి చూశావు. మెలితిరిగిపోతూ—— గుక్కపట్టి. ఎంత ఓదారుస్తున్నా నా గుండెలమీదపడి పోట్లాడావు——నా బిడ్డా, అప్పుడు కంశ్ళార చూసుకున్నానురా——

ఎవరైనా చూస్తున్నారేమోనని పాడుభయం. కాళ్లు వణుకుతూ గంగవొడ్డు కొచ్చేశాను—— నువ్వు ఏడుపు తమాయించుకుని ఎగాదిగా నన్ను- నా వాలకం అర్థమైననాడిలాగు- ఎవరో యోగులు నవ్వుతారే- అలా నవ్వావు. నన్ను చూస్తూ. ఏమేమో- నన్ను పలకరిస్తున్నట్టు ఊఁ కొట్టావు. ఈ పాపిష్టి తల్లికి ఆ సమయంలో అర్థం చేసుకునే తెలివోటి ఏడిసిందనుకున్నావా—— లేదు.

"ఏమైతేనేం, ముంచుకుపోయిందా" అని ధైర్యం తెచ్చుకుని నీళ్ళల్లోంచి ఒడ్డెక్కుతున్నా——

అంతలో— ఆక్షణంలో. ఎవరోమరి- మనిషో- భూతమో—ఆకాశమెత్తున్నాడు. గుడ్లురుముతున్నాడు. ఏం చేయలేకపోయినాను. కండ్లు గట్టిగా మూసుకున్నాను. నిన్ను- నిన్ను మాత్రం వదల్లేదు. గుండెలమీదే పెట్టుకున్నాను.

అయ్యో తండ్రీ! తెప్పరిల్లుకోని చూతునుగదా, నా గుండె మీద నువ్వు లేవు— ఆగుండెలో మాత్రం— అప్పటికీ యిప్పటికీ... (వెక్కి వెక్కి పడుతూ మాట్లాడలేక ఆగిపోతుంది)

కర్ణు:— అమ్మా— అమ్మా— ఎందుకు అవన్నీ జ్ఞాపకం చేసుకుంటావు? అట్లా వ్రాసిపెట్టివుంది... నా మొగాన-

కుంతి:— నాయనా! నన్ను క్షమించానని అను. నాకు అభయం ఇవ్వు క్షమించానని—నేనుట— రాతిగుండె దాన్నిట. లోకంలో బిడ్డలు కన్నవాళ్ళు కూడా నన్ను అనరాని మాటలు— నువ్వొక్కడవు అనుకోకుంటే బాబూ— బ్రతికిపోతాను. (కోడలివైపు చూస్తూ)
ఆమె ఎవరయ్యా—?

కర్ణు:— అది నీ కోడలేనమ్మా— నీ పెద్దకోడలు. దేవీ! నీవు మహా మహారాణీవారి కోడలివి. ఇహ తెలిసిందా నేనెవ్వరో! వారి పాదాలు కన్నీళ్ళతో కడుగు. కరుణామయి కాబట్టి ఈసమయములో ఇంత దుఃఖాన్ని ఓదార్చడానికి వచ్చి దర్శనము ఇచ్చింది. (భార్య కాళ్ళమీద పడుతుంటే లేవదీసి)

కుంతి:— తల్లీ! ఈ పాపిష్టురాలి కాళ్ళెందుకు పట్టుకుంటావు. నేను మహారాణినికాదు. ఇప్పుడు యాచకురాలను.

భార్య:— మీరు యాచకులెందుకైతారత్తయ్యా. శాసకులుమాకు. ఏంకావాలో శాసించండి. చేతులుకట్టుకుని సేవిస్తాము.

కుంతి:— మీరేమీ చేయవద్దు. శాసనకర్తగా - సార్వభౌముడుగా వుండాలి నా పెద్దతండ్రి. నాయనా! నీతమ్ముళ్ళను నీ చేతుల్లోనే...

కర్ణు:— అదంతా మిగిలిపోయింది తల్లీ! సర్వసైన్యాధిపతిగా వుండి

ఇప్పుడు - ఈక్షణంలో నడియుద్ధంలో రాజరాజును మోసం చేసినట్టవుతుంది తల్లీ !

కుంతి:—నాయనా ! మోసమేముంది దీరట్లో — యుద్ధమే విరమించుకోటం గదా !

కర్ణు:—అమ్మా ! ఒక్కమాట చెపుతా విను. యుద్ధం ఆగిపోదు. కావాలంటే - ఒక్క అర్జునుణ్ణితప్ప తమ్ములందరినీ వదిలిపెడతాను.

కుంతి:—వాడు నీ చిన్నతమ్ముడే గదయ్యా!

కర్ణు:—ఏమైతే యేం — ? మా ప్రారబ్ధం అలాకూడదీసింది. వాడికి నేను అన్ననూకాను — వాడు నాకు తమ్ముడూ కాదు. చివరకు ఇద్దరం నిర్వంశుల మైనాము. ఇరుపక్షాల్లో మిగిలిందీ ఇద్దర మే. ఇద్దరికోసమే ఈ యుద్ధం వచ్చినట్లయింది...

కుంతి:—నాయనా ... నీకంతే తెలుసు — ఇదొక మహాయుద్ధమనుకొంటున్నావా ... కడుపార మిమ్మల్ని మోసీ - కనీ ... వృద్ధురాలనై - ఇహనైనా మీ అందరు ఇలా చల్లగా ఉండగా మీ చేతులమీద దాటిపోవాలని కోటి దేవుళ్ళను మొక్కుకున్న తల్లి గుండెల్లో ఇప్పుడు చెలరేగి బాధిస్తున్న అంతర్యుద్ధంకన్నా మీ యుద్ధం యెక్కువైందని అనుకుంటున్నావా? కర్ణయ్యా ... ఒక్కటి విను, మీ భ్రాతృ వధలకు ముందు ... మీ విజయకేతనా లెగరటానికిముందు ... యీ వృద్ధజననిని కడతేర్చి పుణ్యంకట్టుకోండి—ఆ పనైనా చేయండి. ఈ బాధ - ఈ గుండెల్లో మండుతున్న మమకారమహాగ్ని - కర్ణయ్యా ! మీ అందరిపీడ వదలిపోతుంది. ... అదే అడగటానికివచ్చాను ... ఆ ఆ ... ఆమాత్రం; పెద్దకొడుకువు

కాబట్టి... నిన్నే ముందుగా అడుగుదామని వచ్చాను...
( కంటనీరు తుడుచుకొంటూ ఏడుస్తుంది )

కర్ణ:—ఎందుకమ్మా గుండె చెరువు చేసుకొంటావు – ? సుక్షత్రియాంగనవు – దైవాంశములనుకన్న వీరమాతవుగావటమ్మా నువ్వు – నన్నే అడుగుతున్నావా, ఐతే సమాధానం చెప్తాను... నీ వేదనకు... నేను చెప్పేదికూడా వుంది. ... నీ వొళ్ళో కూచోని చెప్పాలి ఆమాటలు... అమ్మ వొడిలో తల పెట్టి ఇహ నాకు చెప్పుకొనేభాగ్యం వుంటుందో ఉండదో...

(కుంతి కర్ణుడి తల నిమురుతూ )

కుంతి:—ఏం మాటలురా కర్ణయ్యా ! అంతటి అమంగళం ఎందుకు నా పాడుచెవులకు వినిపిస్తావు–?

కర్ణ:—వినాలి మరి– యశస్వులుకాని కొడుకులెందుకమ్మా–? మహారాజ్ఞివైన నీకుపుట్టి–శౌర్యం చచ్చిపోయినట్టుగా ఒకరి ముందు ఇంకొకరు మోకరిల్లే నీచక్షత్రియు లనుకున్నావా నీ కొడుకులు–? సూతపుత్రుడుకాడు. సుక్షత్రియుడురా యని అనిపించుకొనుటకు ప్రాణము పణముగా నొడ్డుకొన్న కొడుకొకడు – పురుషకారమేలేదు. పురుషోత్తము నాశ్రయించుటలోనే సర్వతరణోపాయములు సిద్ధిస్తవని వినమ్రుడైన కొడుకొకడు – ఒండొరులు రణభూమిలో ప్రవేశింపబోతున్నారు.

ఈ అపూర్వ భావసంఘట్టమును – కాదు ; ఈ అతిలోక భిన్నప్రకృతులను – ఈ భీషణద్వంద్వ మూర్తులను – నేడొక్క– భారతదేశమే కాదు – ప్రపంచ మానవసింహులంతా ఎప్పుడు తెల్లవారుతుందోనని ఎదురుచూస్తున్నారు.

ఈ ఇరువురిలో యెవరు పూర్ణుడో – – ఎవరు మానవజాతికి ఆదర్శపాత్రుడు కాగలడో – వాడే నీ కుమారుడు

గా భావించు. గర్వించు – నీఈ దుఃఖాశ్రువులే ఆనందాశ్రువులై హర్షపులకితురాలవై ఆశీర్వదించు – తాత్కాలికమైన విజయప్రశంశలకు స్థానమే లేదు. అట్టికుమారుడు మరణించినా ఆనందించవలసిందే – అలాంటివానికి మరణం వుంటుందా – అప్పుడు నీవు వీరమాతవే కాదు– రాజమాతవే కాదు– సాటిలేని లోకమాతవు ఔతావు. నిన్ను లోకమాతనుగా ప్రతిష్ఠించి స్వర్ణాక్షరాలతో నీపేరు భారత చరిత్రకారుడికి అందించాలని సంకల్పించాను.



తల్లీ! ఆనాటినుండి నేను రాధేయుణ్ణి కాదు–
కౌంతేయుణ్ణని పిలిపించుకోటానికి సగర్వంగా
అంగీకరిస్తాను –

లే! నన్ను ఆశీర్వదించు – అదుగో, తూరుపు రేఖలతో ఆకాశం అలంకరించుకొంటోంది.

ఎవరా అక్కడ – అమ్మను – కాదు! వీరిని జాగ్రత్తగా పాండవశిబిరం దాకా పంపించిరా!

(కర్ణుడు నమస్కరిస్తాడు – కుంతి లేవదీస్తుంటుంది.)

(తెర)

# కర్ణధారి

## ౭వ రంగము



### కురుక్షేత్రం

శ్రీకృ:— అహా! బ్రహ్మరుద్రాదులు— దేవతలు అంతా ఆకాశ మండలం ఆక్రమించారు- ఇదే సరియైన తరుణం. తెలుసుకోండి. భారతదేశాన్ని బలిపీఠం చేసిందెవరో- శాంతికాముకులెవరో- సామ్రాజ్యవాదులెవరో- బాగా పరిశీలించండి

(అర్జునుడు శంఖంపూరిస్తాడు. కర్ణుడు శంఖం పూరిస్తూ ప్రవేశిస్తాడు)

కర్ణు:— శల్యా! పోనియ్యి రథం- ఆలోచిస్తావేం?

శల్యు:— చూస్తున్నావా కపికేతనం. పక్కకుతిప్పితే క్షేమం. చెప్తున్నాను.

అర్జు:— కర్ణా! నిలు నిలు. పక్కకు తోలిస్తున్నావేం రథం?

కర్ణు:— శల్యా! నీసారథ్యం నా ప్రాణం తీస్తున్నది. సూటిగా పోనియ్యమని చెప్పటల్లేదా రథం... నిన్నేనయ్యా...

శల్యు:— అన్నీ పీనుగుల గుట్టలు. పైగా నెత్తురేరు పొంగిపడ్తుంది. ఆ! ఆ! దూకవొకు. అట్లేపోనిస్తానులే.

కర్ణు:— శల్యా! గుర్రాలు పరుగుపుచ్చుకుంటున్నయ్యే! ఆగనియ్యి. నీకే. ఆపమని నీకేచెప్పేది—

[కృష్ణార్జునులు వికటంగా నవ్వుతారు]

కర్ణు:— (రథంతో ప్రవేశిస్తూ]

ఉ. అంతటి నవ్వువచ్చినదయా, ద్రోణగార్లకు- చావు దప్పి గ
ల్లంతయిపోవ, పట్టపగలందరు చూచిరి నిన్న నేగదా-
ఇంతటిలోన ఇంత పొగరెక్కడిదో మరి- నేడుకూడ ప్రా
ణాంతకుడైన కర్ణుడెదురయ్యెను, మీ గ్రహచారమక్కటా!

శల్యా- ఇటు ఇటు- అది నెత్తుటిరొంపి. అఘాతమయ్యా! కనపట్టల్లేదా? అయ్యో! చెపితే వినిపించుకోవేమయ్యా- ఆగనియ్యి రథం. అదిగో చక్రం దిగబడపోనేపోయింది. నేను కిందికి లంఘిస్తానుండు. పగ్గాలు లాగిపట్టు... అబ్బః...

శ్రీకృ:— అర్జునా... ఊఁ బాణంసంధించిగూడా ఆగుతావేం?

అర్జు:— విరథుడైనాడు... ఎట్లా ప్రయోగించేది బాణమని శంకిస్తున్నాను—

శ్రీకృ:— మంచి శంకయే వచ్చిందినీకు. విరథి ఐతేయేం, రథిఐతేయేం. విరోధిపై ఎక్కుపెట్టిన బాణానికి అవరోధం ఉండకూడదు.

కర్ణు:— కృష్ణా! రథచక్రం ఎత్తుకోనియ్యి- ఇంతలో ఏం మునిగిపోలేదులే—

శ్రీకృ:— అబ్బా!

గీ. ఎంతదాచిన గురువెంద కెచట నలుపొ
తెలియదా కర్ణ! ఇది చావు తెలివిగాక-
ఏమికొంపలు మునిగిపోయిన వటంచు
చేసితివొ నేటిదనుక దుశ్చేష్టితములు ?

కర్ణు:— ఎందుకుచేశానా- దుర్యోధనుడు నాకు బంధువనీ, లోకోద్ధ

రణానికి నేను కంకణం కట్టుకున్నాననీ చేశాను. స్తుతిపాఠము లెక్కువై మతి తిరిగిపోయి చేశాను. తెలిసిందా?

శ్రీకృ:— తామసీ—

కర్ణు:— "తామసీ"? నేనా తామసిని— ద్వాపరాంతం చేయటానికి తారసిల్లిన తామసివి, నీవు— బంటుతనము కోల్పోయిన వాడికి భక్తుడని పేరుపెట్టి, బ్రహ్మాండకర్తనని పెత్తనం పైన వేసుకొని మారణ జ్వాలలు దరికొల్పిన తామసివి, నీవు—సారథిత్వపు మాయ ముసుగు వేసుకుని భ్రమింపజేసి, మోసంచేసి సంగరమంతా బొంగరంలా ఆడిస్తున్న తామసివి, నీవు— నన్ను తామసీ అంటున్నావా పైగా?

అర్జు:— ప్రభూ... వింటున్నారా? ఒక్కమాట వానికి బల్లెపువేటుగా గుచ్చుకున్నది. ఎంత వ్యాఖ్యానం చదివాడు?

శ్రీకృ:— ఆ నాస్తికుడి వాదం అంతరుచిగా వుందానీకు— వదులు బాణాన్ని. శరపరంపరలుగా, ఒడలు తూట్లు పడిపోవునట్లుగా. ఊఁ (అర్జునుడు బాణాలు వదిలాడు)

కర్ణు:—ఈ చీకట్లు ఎక్కడివి? ఫుంఖాను ఫుంఖాలుగా ఎటుచూసినా ఓః... ఏమి వీడి బాణప్రయోగ వైలక్ష్యం— నాగాస్త్రం— ఏదీ నాగాస్త్రం కొంచెం చూంచిపెట్టు రాజా!

శల్యు:— మంచివాడివే... నేను సారథిని— అస్త్రాలు అందించటానికి నీసేవకుణ్ణికాదు.

కర్ణు:— అందుకే నిన్ను రాజా అనిసంబోధించింది. అదుగో యింకో రథచక్రం కూడా దిగబడి పోతున్నదయ్యా— చూడు నాగాస్త్రం చూడు మిత్రమా—

శల్యు:— నీ నాగము పాండవపున్నాగము నేమిచేస్తుంది? నాగశయనుడైన నారాయణుడు చాపునుండగా నాగాస్త్రంకొరకు

దేవులాడుతూ వేంటే- ఆయన తల్ల కింద నున్న ఆదిశేషుడు వేయి నాలుకలతో పైనపడుతాడు కర్ణా;

కర్ణు:— ఆదిశేషుణ్ణి కీర్తిశేషుడిని చేస్తాను. బాణం తే-

శ్రీకృ:— అదుగో అర్జునా! సంధిస్తున్నాడు నాగాస్త్రాన్ని ఆ అస్త్రం వదిలాడంటే రథరథాంగముగా నిన్ను కబళించి వేస్తుంది తెలుసునా-

అర్జు:— భగవాన్- క్షమించాలి నన్ను-

చ. అరదము క్రుంగుచున్నది- రథాంగము నెత్తుటి రొంపిలోపలన్
బరువయి మాటిమాటికిని వాని భుజాగ్రము జారిపోయెదుర్
స్థిరుడయి లక్ష్యభేదనము చేయగ- బాణము నెక్కుపెట్టగా
దొరకుట లేదు వీలిపుడు- తొందరపెట్టుట పాప మచ్యుతా.

కాస్త రథచక్రం ఎత్తుకోనిద్దాం-

శ్రీకృ:— ఉం - పాపం ... ఒక రథచక్రమే కాదు- కాలచక్రమే తిరగబడిపోతూంది. కొట్టు అర్జునా!

అర్జు:—ఇంత నిస్సహాయస్థితిలో ... విరథుడైనవాణ్ణి ... భగవాన్ ! వీరధర్మం కాదయ్యా ?

శ్రీకృ:—వీరధర్మం ... పద్మవ్యూహంపన్ని- బలిపశువులాగా చుట్ట వేసి, నిస్సహాయుణ్ణి చేసి- అభిమన్యుణ్ణి ముక్క ముక్కలుగా కొట్టి కాకులకు వేసినసంగతి మరపుదగిలిందా అప్పుడే — ?

కర్ణు:—అబ్బః ... కృష్ణా ! అశనిపాతం ... ఆ విషయం జ్ఞాపకం చేయబోకు -

చ. "తల్లలెగురున్ పరాకుగుడి-ధర్మమొ గిర్మమొ చూతు నావలన్
తలపడు" అన్న యా గురుని తప్పది — ఊరక నన్ను దోషిగా

చులకన సేయబోకు మధుసూదన ! ఏటికి కంఠశోష — నా బలమది పాలుగారు పసివారల జోలికి పోవదెన్నడుకా.

శ్రీకృ:— అంతకుముందేంచేశావు-? అయోనిజయైన ఆడపుట్టువు బట్టలు - ఛీ ! ఎంతనీచం !! — నిస్సహాయగాదా అప్పుడు ద్రౌపది-? నీవు ప్రోత్సహించలేదా ?

కర్ణ:—నేనుప్రోత్సహించానా? విన్నావా నువ్వు—? బహు పత్నీకులైన కృష్ణార్జునులకు పడతుల మర్యాదలు తెలియకపోవచ్చును గాని కర్ణుడికి తెలుసు ... అది ఉద్దీప్తక్రోధవివశుడైన రాజరాజు కోసం — పాండవులు చేసుకొన్నపాపం — ప్రోత్సాహాలుచేసి పోరు కల్పించటం నీకు నిత్యవ్రతం.

శ్రీకృ:— ఆలోచించి మాట్లాడు కర్ణా !

కర్ణ:— ఆహా, ఆలోచించి— పునరాలోచించి మాట్లాడుతున్నాను. భీష్మవధారహస్యంకోసం ప్రోత్సహించావు ... గురుమారణ పథకానికి ప్రోత్సహించావు ... భూరిశ్రవ ఘోరహత్యా కాండకు ప్రోత్సహించావు; రణధర్మ విరుద్ధంగా ఇప్పుడు నా పైకి ప్రోత్సహిస్తున్నావు. తెలిసిందా?

అర్జు:— ఆ భీష్మద్రోణాదులే ఎందుకు వీరిని దైవాంశమని పూజించారో ఆలోచిస్తే తెలుస్తుంది. వారికన్నా గొప్పవాణ్ణనుకుంటున్నావా నీవు ?

కర్ణ:— (నవ్వి) దానికి లోకం ప్రమాణం.

అర్జు:— ఓహో! నీకు నశించే లోకం ప్రమాణం- కాబట్టే నాస్తికుడవు.

కర్ణ:— ఓహో ! నీవూ ఒక వ్యాఖ్యాతవైనావా ? కృష్ణా ! నేను నేను నాస్తికుణ్ణా ! నీ వొక్కడవే ఆముష్మికార్థం చెప్పగలవా

డివి. తేల్చుకోవాలి మీ మీ గూఢార్థాలు ... చెప్పు ... హృదయశల్యంలా వేధిస్తూంది మీ సంబోధన— ఇంత మహా యుద్ధంలోఏ మహాస్త్రమూ పీడించనంత బాధ వేస్తూంది మీ సంబోధన ... చెప్పు కృష్ణా !

శల్యు:— నేను చెప్పనా ! ఇది వాగ్యుద్ధం ... యుద్ధం చేతగాని వాళ్ళ కిదే శరణ్యం.

కర్ణు:— శల్యా ... (గద్దిస్తాడు)

శ్రీకృ:— (నవ్వుతాడు)

కర్ణు:—నవ్వబోకు. చెప్పాలి ... మదించి మల్లయుద్ధం చేసినట్టు కాదు.

శ్రీకృ:— ఐతే విను. నశించే సామ్రాజ్యాన్ని ... సామ్రాట్టును ఆశ్రయించి ఆశ్రయంఇచ్చే నీవెవ్వరో— నీ...

కర్ణు:— (వికటంగా నవ్వుతూ) ఇహ ఆగు ... నీవుమాత్రం—!

శ్రీకృ:— నేనా— ప్రభుతాహంకారాన్ని అణచి, ప్రజా కల్యాణం చేకూర్చాలని సహాయపడుతున్నాను— కర్ణా!

గీ. అణువు మొదలు బ్రహ్మాండ పర్యంతమగుచు
సృష్టి స్థితి లయంబులను కల్పించి తాను
కర్తయయ్యును – కాకుండ – కలిసియుండు
ఆ మహత్తరశక్తిలో – అణువు నీవు

కర్ణు:— ఓహో— ఎప్పుడో గ్రహించాను ఆసంగతి – నేను;

గీ. అణువునేగాదు – పరమాణువగుదునేను
అది మహాశక్తి – సచరాచరాత్మకము
శాశ్వతానంద సాగర సంగమమున
కరగిపోవును పైపైకి పెరిగి పెరిగి

శ్రీకృ:— అది భయంకరమైన ఊహ– కర్ణా! నీవాశించినట్టుగా–

గీ. అణువులోపల విలయజంఝూనిలంబె
కలదుగాని. ఆనందసాగరములేదు–
భృగు మహర్షి పాదమ్మున పొగలురేగి
ఈశు ఫాలాన మంటలై మెగసె నణువు–

ఉ. కాదణువుల్ మరేదియును గాదయ, కర్ణుడుగారు! విందురో...
ఏదియనాదియయ్యు జగమేర్పడ తానె పునాదియయ్యెనో–
ఏదియు "నాదినాది"యని ఎంచదొ–తానయివచ్చి ప్రేమదా
యాదులయింటి కల్పతరువౌనెదియో – అదియే మహత్త్వగున్

అర్జు:— తెలిసిందా – వ్యాసాదులైన మహర్షులు, భీష్మాదులైన రాజర్షులూ ఆ మహత్తే ఈ మహానుభావుడని సేవించారు.

కర్ణు:—అహ్హ్వాహ్హ్వాహ్హ్వా – అహ్హ్వాహ్హ్వాహ్హ్వాహ్హ్వా

ఈ మనుష్యుడే మహాత్తైతే – అహ్హ్వాహ్హ్వాహ్హ్వా – ఈ కర్ణుడుకూడా అంతవాడు కావచ్చునేమో? అలాకాదు... ఈకర్ణుడు పరమాణువే... పరమనిగ్రహం సాధించి బ్రహ్మాండము నధిగమించగల పూర్ణపురుషకారంగా విజృంభించి యిప్పుడు ఆ మహాత్తుకు, దానిని సేవించేవారందరికి అడ్డంగా వచ్చి నిల్చున్నాడు. కాచుకోండి...

ఈ విరథుడిపైననే మహత్త్వపూర్ణమైన మీ వివిధాయుధాలనూ ఇహ ప్రయోగించండి...

అర్జు:—ఏమంటావు ... ప్రభూ !

శ్రీకృ:—అది పురుషకారంకాదు, అహంకారం — పైగా హద్దులు మీరిపోయింది. కొట్టు – ఒక్క–వేటుతో ఆ తల – తలలోని

భాష్యం ఎగిరిపోవాలి ... పోవాల్సిందే — ఇలాంటివ్యాఖ్యా తలు _ రాజ్యాధికారులే ఐతే _ ఊఁ

అర్జు:—అబ్బో - ఆ గర్వించి గరుకెక్కిన కంఠనరాలను కత్తిరించ టమే — మహిమాన్వితమైన మానవధర్మం - మారణధర్మం మూర్తికట్టి ... చూస్తున్నావా_? ప్రభూ ... ప్రభూ !

(బాణము లాగలేక)

శ్రీకృ:— ఊఁ_

అర్జు:—అశక్తుడనై నానేమి ప్రభూ !

శ్రీకృ:—ఓః — మరీమంచిది. "అథైతదప్యశక్తోసి కర్తుం మద్యోగ మాశ్రితః" నాకొరకు - నన్నాశ్రయించి ప్రయోగించు అర్జునా !

(పెద్దకోలాహాలం వినిపిస్తుంది _ జై దుర్యోధన మహారాజునకు జై!)

శ్రీకృ:—అర్జునా ! వింటున్నావా ... ? దుర్యోధన సహితంగా సేనావాహినులన్నీ విరుచుకు పడుతున్నై_సంధించాడు నాగా స్త్రం ... ధనుష్టంకారభీషణమైన ఆ అట్టహాసం చూసి అధీ రుడవై పోతున్నావా _ ?

అర్జు:—అధీరుణ్ణికాలేదు. రణధర్మం త్యజించేనా ... చెప్పు నీశలవు ...

శ్రీకృ:—ఇంకా శలవు ... శలవు నీకు_

(రథంమీాదనుంచి దూకేస్తాడు)

అర్జు:—అయ్యో ... అదేంటి ప్రభూ! నన్ను వదిలేసిపోతున్నావా! ఇదేమిపని ప్రభూ !

శ్రీకృ:—నేను కేవలం సారథిని _ నాకేం తెలీదు_ నన్నేమీా అడగ వోకు - నీవు చుట్టానివి కాదు, కర్ణుడు కాకపోలేదు. శల్య సారథ్యంతో - శాపాలతో క్రుంగిపోయియున్నాడు కర్ణుడు.

వాడికి అహంకారమే లేకుంటే — ఆ జగదేక పురుషకారం— ఆ మహోదాత్తధైర్య మంధాచలం — ఓః — ఈ సారథ్యం వాడికిచేసివుంటే _ లేదు _ ఇహ వాడితో కలసి నీ మీాదికి వస్తాను.

కర్ణ:— అదీధర్మం - ధర్మం అంటే అది కృష్ణా…

శ్రీకృ:—అదే నేనూ చెప్తున్నాను. మీాఉభయులకుకూడా ధర్మం ధర్మం అంటూ ఒకరు ఉద్రేకంతో — ఒకరు నిర్వేదంతో— ఏమిటీ క్లిష్టసమస్య … ఆలోచించుకోండి — నిర్ణయించుకోండి ఏది ధర్మమో _ ఏది కర్తవ్యమో — ? దేనివల్ల మనుష్యుడి జీవితాదర్శం నిలువబెట్టుకోవలెనో బాగా ఆలోచించుకోండి యిద్దరూ. ఆ పరమశ్రేష్టమైన నిష్ఠ — ఆ ధర్మ కర్మపాపవిచ్ఛేదకమైన పరాకాష్ఠ…నిర్ణయించుకోండి.అర్జునా నీవే నిర్ణయించుకో _

కర్ణ:—ఓహో! అన్నీ నిర్ణయించుకొనేయున్నాను _ అన్నీ తేల్చుకొనే యున్నాను. — అర్జునా ! కాచుకో_

అర్జు:—నాకు నిర్ణయమేముంది…ప్రభూ ! … అన్ని నిష్ఠలు పరాకాష్ఠలు నీవేనాకు … నాకు శరీరభ్రాంతిలేదు. నాకు రాజ్యకాంక్షలేదు… నేను వీరవిఖ్యాతికై కాంక్షించి రాలేదు యీా రణరంగం లోకి _ కాని

మ. విరథుండై రథచక్రమెత్తుకొనుచో, ప్రేరేచి రాధేయునిక్ట
దురమం దొక్కనిజేసి చంపెనట పార్థుండంతవాడంచునర్ట
పరిహాసంబునుజేయు లోకమది _ నాపై ఘోరనిర్ఘాతముల్
కురిపింపంగల రెల్ల దేవతలు, సంకోచింపరావంతయున్ట.

శ్రీకృ:— లోకాపవాద భీతియూ… ఇదిలోకాపవాద భీతి అనుకుం

టున్నావు. అది కాదు నీకడ్డం వస్తున్నది. నీకడ్డం వస్తున్నది– నీ అహంకారం అని తెలుసుకో లేకుండా వున్నావు.

నీ త్యాగంముందు, నీ శౌర్యంముందు, నీ ధనుర్విద్యా వైదుష్యంముందు దేవాసుర యక్షగంధర్వాదులు శిరస్సులు వంచుకున్నారు. ఇప్పుడు ఆ అహంకారం అడ్డంవస్తూంది. అట్టి అహంకారం వల్లనే కర్ణుడు దేవబ్రాహ్మణాపచారంచేసి శాపగ్రస్తుడైనాడు తెలుసునా?

అనుకుంటున్నావేమో– "ఈయుద్ధం నేనుచేస్తున్నా ననీ, నేనేకర్తననీ"

అర్జు:— లేదు ప్రభూ లేదు.

శ్రీకృ:— లేదా– లేకుంటే నీబుద్ధి ఏకాగ్రమై సమగ్రమైవచ్చి ఈ స్థితిలో నీయోగం ఎందుకు భ్రష్టమైంది–? నీవిప్పుడొక సామాన్య– స్వార్థ– సంకుచిత– సంశయాత్మకుడవై పోయి నావు. "సంశయాత్మా వినశ్యతి"

( పెద్ద ధ్వనిచేస్తూ నాగాస్త్రం బుసపెట్టుతుంది)

అర్జు:— శరణార్థినిప్రభూ! శాసించండి.

శ్రీకృ:— [తిరిగి రథందగ్గరకు వస్తాడు]

త్యజించి వెయ్యి నీ ధర్మజిజ్ఞాస– లోకధర్మం– రణధర్మం– దేహధర్మం నీవూ, నీ అహంకారం ఏక్షణంలో చూర్ణమైపో తయ్యో– ఆక్షణంలోనే సర్వధర్మాలు స్వయంగావచ్చి నీలో సుప్రతిష్ఠితం ఐతవి.

పరిత్యజ్యధర్మాన్ ... సర్వధర్మాన్ పరిత్యజ్య– పరిత్యజ్య పరిత్యజ్య ధర్మాన్– ఏకం మాం శరణంవ్రజ

(అర్జునుడు శరణాగతి చేస్తాడు. అప్పుడే కర్ణుడు నాగాస్త్రం

వదలి పెడతాడు. శ్రీకృష్ణుడు రథాన్ని భూమిలోకితొక్కు-
తూ కర్ణుడివేపు చూస్తూనే, అర్జునుణ్ణి లేవదీస్తాడు- నాగాస్త్ర
వచ్చి అర్జునుని కిరీటం కిందపడిపోతుంది)

శ్రీకృ:— అమ్మయ్య! ప్రాణందక్కింది. మరేం ఫరవాలేదు. కిరీటం
పోతేపోయింది. అర్జునా! అదుగో! పాము. ఖాండవదహనం
నాటి పగతీరక నీమీదకి వస్తున్నది. ఆపాము. ఒక్క బాణం
తో ఆ నాగుని, వీరపున్నాగుడైన కర్ణుణ్ణి తెగవెయ్యి.

( అర్జునుడు బాణంవేయగా (తెరలో) అహో! కర్ణుడు నేలగూలాడు.
విజయఢంకాలు మ్రోగిస్తారు పాండవసైన్యం)

కుంతి:— (లోపలనుండి] అయ్యో! కొడుకా- నాకర్ణయ్యా-

అర్జు:— ఆయేడుపు ఎక్కడినుంచి- ప్రభూ! ఆ వస్తున్న దెవరో
చూడు.

కుంతి:— అయ్యో... కర్ణయ్యా... కొండకూలినట్టు కూలిపొయ్యా
డే నాకొడుకు— (ప్రవేశిస్తుంది)

శ్రీకృ:— పుత్రశోకం భరించలేక మీఅమ్మ వస్తూంది అర్జునా!

అర్జు:— అమ్మా- ఆపడిపోయింది కర్ణుడమ్మా! మనవిరోధి- కొడు
కంటావేమిటమ్మా- బావా! యేమిటిది? ఆశ్చర్యంగాఉందే?

కుంతి:— (కర్ణుడి దగ్గరపడి) నాతండ్రీ— నన్ను కడతేరుస్తావనీ,
నీచేతిమీదుగా ఇన్నినీళ్ళు వదులుతావనీ... నాపెద్దతండ్రివి
కదయ్యా... యెవరెన్ని మాటలన్నా— ఎవళ్ళెంతనిందించి
నా- నీచపరిచినా- నీవు బతికి వుంటె అంతేచాలన్నని ఏడ్చా
నయ్యా కర్ణయ్యా— నాబతుకెంత అధోగతి పాలయ్యిందిరా
బిడ్డా—

అర్జు:— సంగతేమిటమ్మా- నాకేం తెలియటల్లేదమ్మా-

కుంతి:— (దుఃఖం-కోపంగూడా వచ్చింది) నీకు తెలియకుంటె నిన్ను పట్టినవాణ్ణడుగు- తల్లీ కొడుకులను ఎడబాపినవాణ్ణి పోయి అడుగు. అన్నలు, తమ్ములు ఒకళ్ళకు తెలియకుండా ఒకళ్ళు చిత్రవధలు చేసుకునేట్టు- దయాధర్మాలు లేకుండా తాకట్లు- తంపీలు——

శ్రీకృ:—అత్తయ్యా ...

కుంతి:—నేను నీకు అత్తయ్యనూ కాను — నీవు నాకు అల్లుడవూ కావు. మా కర్ణయ్య వీడికి పెద్దఅన్న అని తెలిస్తే - నీకొక్కడికే తెలియబట్టి కాగు-? (ఏడుస్తూ) నీ వేదో మమ్మల్ని ఉద్ధరిస్తావనీ - మా పాలిటి దేవదేవుడవనీ నమ్ముకొన్నందుకు కాదు - ?

అర్జు:—అమ్మా! కర్ణుడు కౌంతేయుడా ... ? అమ్మా ! మా అన్నయ్యయా ! తల్లీ ... అయ్యయ్యో ... ఎంత కిరాతకం చేశానే - రౌరవాది నరకంలోపడే పాపం చుట్టుకొన్నానే - అన్నా ... నన్ను శపించు - దుర్గతులకు పొయ్యేట్టు శపించు అన్నా - ( శవంమీద పడతాడు )

కుంతి:—ఇహ చూడవయ్యా ... కృష్ణయ్యా ... ఎంత ఘోరం చేయించావయ్యా — ? ఒక్క తల్లి పిల్లలు గదయ్యా - కృష్ణయ్యా —

శ్రీకృ:—అర్జునా - అర్జునా - !

కుంతి:—మాట్లాడేం ... నా చిన్నతండ్రి ! ఎట్లా కృష్ణయ్యా - ?

శ్రీకృ:—మీరు కాస్త ఆగండి - అర్జునా - ఇటుచూడు నిన్నే -

కుంతి:—ఇంకెక్కడి అర్జునుడు-; వాడు కూడా ప్రాణాలు వదిలాడు. ఇంకేముందయ్యా - కృష్ణయ్యా ? నా కడుపుల్లో చిచ్చు

పెట్టావు. ఇంకో ఏముంది -? నీవు అలనాడు రాయబారం వెళ్ళకుండా మా ధర్మయ్య వెళ్ళివుంటే -? ఈ యుద్ధం, ఈ రక్తపాతం ఇంతటి మారణకాండ సాగించావా? నా మీద - నా బిడ్డలమీద - ఇంతడుక్రోషం కడుపులో పెట్టుకొని నెత్తురు ఏరులు పారించావా? కృష్ణయ్యా!

మా సింహాసనాన్ని - మా సామ్రాజ్యాన్ని చిందర వందరచేసి, భారతదేశమంతా గగ్గోలుగోలిపి - కృష్ణయ్యా! పైగా పాండవపక్షపాతి నంటావా? బంధుప్రియుణ్ణంటావా?

అత్తయ్య ఇంత తెగించి మాట్లాడుతున్నదని అంటావేమో - అను. ఇహ నాకేం భయంలేదు. ఇంకా ఏం భయం- నా బిడ్డలు ... ధర్మాత్ములైన నా బిడ్డలు ... వేదవేదాంగాలు సర్వశాస్త్రాలూ చదువుకొన్న నా తండ్రులే,

ఇంత వినాశనానికీ ... కురువంశం ఊరూ పేరూ లేకుండా పోవటానికీ, నీవు కాదా కారణం -? నీవు కాదా బాధ్యుడవు -? మాట్లాడవేంఅడుగుతూంటే - నవ్వుతావేం? చెప్పు. ఈ ప్రశ్న ఎవరో వేస్తున్నారనుకోకు — భారతదేశంలోని ప్రతిపాత్రి, అంతేకాదు- ప్రపంచమానవకోటి అంతా కోటి అంతా ఏకకంఠంతో యెలుగెత్తి అడుగుతూంది. చెప్పు -

( అర్జునుడికి సూర్యుడు ఆవేశం ఐతాడు )

అర్జు:___ఏమిటా మాట్లాటం? వొళ్ళు మరిచిపోయినావా - ఎవర్ని ఆ నిందించటం ... జాగ్రత్త ... జాగ్రత్తగా మాట్లాడు ఆఁ ...

కుంతి:___ అర్జునా ... అదేంటి- అలా వెర్రిగా చూస్తావేం? కృష్ణయ్యా- పట్టుకోవాణ్ణి ... పడిపోతాడేమో- మీతల్లినయ్యా- అర్జునా ...

అర్జు:— ఇహ చాలించు ... గొప్పతల్లివి — గౌరవాల కాశపడి గంగలో పారేసిన తల్లివి. చెప్పకో వచ్చావు యింకా...

కుంతి:— ఇదంతా ఏంటో నాకు అర్థం కావటల్లేదు— కాస్త చెప్పు కృష్ణయ్యా—

శ్రీకృ:— భయపడకండి అత్తయ్యా. ఆ మాటలు మన అర్జునుడివి మాత్రం కావు. ముందు చేతులు జోడించి నమస్కరించండి. కర్ణుడే మాట్లాడుతున్నాడో - ధర్మకర్మలకు సాక్షీభూతుడైన ఆతని తండ్రి సూర్యభగవానుడే మీ సందేహాలకు సమాధానం చెప్పబోతున్నాడో — ఇలా అనండి.

శ్లో॥ నక్షత్రగ్రహతారాణా మధిపో విశ్వభావనః
తేజసామపి తేజస్వీ - ద్వాదశాత్మ న్నమోస్తుతే॥

కుంతి:— స్వామీ— ఎవరో మీరు. అపరాధం చేశాను. పెద్దలో- పెరుమాళ్ళో - ఇలవేల్పులో - కులదేవతలో శలవివ్వండి.

అర్జు:— శలవివ్వకపోతే మరిచిపోయినావా — ఆకాశంనుండి దిగి వచ్చి అనుగ్రహించి తొలిసారి నిన్ను పుత్రవతురాల్ని చేసిం దెవరోకూడా మరిచిపోయినావు. అపరాధిని అంటావా? కాస్త అపరాధమా నువు చేసింది ? ఎవరి చండశాసనంవల్ల సమస్త సృష్టినీ పోషించగలుగుతున్నానో-

ఎవరి అవ్యాజ అఖండ దయాప్రసాదం సర్వగ్రహ గోళాలకూ సమంగా పంచి ఇస్తున్నానో-

ఆ దేవదేవుణ్ణి ... మనుష్యుడనుకుని ... మర్యాదకూడా తెలియకుండా అనరానిమాటలంటున్నావా?

నీ మూలంగా- ఆదుర్యోధనుడి మూలంగా- దూరదృష్టి

లేని దేవ బ్రాహ్మణులమూలంగా కలుషితుడై పోయినాడు నాబిడ్డ-

తన దురాలాప- దురాక్రమణ- దుర్ణయాలకు దుర్యోధనుడు కర్ణ ధారిని చేసి కలుషితుణ్ణి చేశాడు నాకర్ణుణ్ణి ... కరుణామయుడైన స్వామి సహించలేకపోయినాడు. కర్ణుణ్ణి కంఠమాలగా ధరించి కైవల్యం ఇచ్చాడు అహంకార దోష దూషితుడైన కర్ణుణ్ణి ఆలింగనం చేసుకుని అనుగ్రహించి కర్ణ ధారిమై నిల్చున్నారు. జాగ్రత్త- తక్కిన నీకొడుకులకు స్వర్గాదిభోగాలు లేకపోగా-నరకద్వారాలు తెరవబడిఉన్నాయి.

కుంతి:—అయ్యయ్యో- స్వామీ. నాకొడుకులు ధర్మాత్ములే- దయాశాలులే... త్యాగధనులే... నరకప్రాప్తియా స్వామీ!

అర్జు:—ఆవిషయం నాకవసరంలేదు. ధర్మాత్ముడన్నా దయాశాలి యన్నా- త్యాగధనుడన్నా ...కర్ణు డొక్కడే. అనర్థాలెన్ని వచ్చినా ఆడినమాట తప్పక ఆదర్శప్రాయుడుగా నిలు చున్నాడు కర్ణుడు-

తారతమ్యాలు లెక్కచేయక దయాసముద్రుడై మృత్యు పర్యంతము దానవ్రతం సాగించిన ద్వాపరయుగ మహాదాత ఈ కర్ణుడు.

బ్రహ్మాండమైన సామ్రాజ్యాన్ని — పతివ్రతయైన స్త్రీని, వదలివేసిన త్యాగధనుడు ఈ కర్ణుడు ;

తాను నమ్మిన ధర్మాన్ని పరమేశ్వరు డెదురైనా తిరుగులేకుండా అడ్డుకొని ఆత్మార్పణం చేసుకొన్నవాడు ఈ కర్ణుడు ;

కర్ణుడే లేకుంటే, దుర్యోధనుడు లేడు —

దుర్యోధనుడే లేకుంటే, దురహంకార దురాక్రమిత సామ్రాజ్యాలు లేవు —

ఇప్పటినుంచీ : అహంకారం లేని, అనర్థాలు లేని, అహింసాబద్ధమైన దాన్నిగా ఈ హస్తినాపుర సింహాసనం అలంకరింతామనే ఈ సన్నాహమంతా జరిపించారు భగవానుడు.

రణరంగానికి స్వయంగానే స్వామివారు వేంచేయటం— రక్తతర్పణా లిప్పించటం అందుకే ...

ఈ రోజే భావిభారతదేశ శుభోదయం —

ఈరోజునుంచే భారతీయధార్మికజీవనానికి నవోదయం! జాగ్రత్తగా నడుచుకోండి అంతా —

కుంతి:— ( ప్రాంజలియై ) ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

శ్రీకృ:—అర్జునా ! స్మృతి వచ్చిందా –? ఇటుచూడు,
( అర్జునుడి చెంపలమీాద కన్నీళ్ళు తుడుస్తూ )

ఉ. ఏలవిధాన కంటతడి బెట్టుచు నుంటివటయ్య అర్జునా !
చాలును – నిన్నునమ్ముకొని, చచ్చినవీరుల విస్మరించి, నీ
పాలికి మృత్యువై ఎదురువచ్చినవానిని అన్నయంచునున్
జాలివహించువార లోకక్షత్రియులా ? నిజధర్మవర్తులా ?

ఉ. ద్వాపరమెల్ల పాపపరితప్తముచేసిన వారలెంత సే
నాపతులైన రాజులయినన్ తెగిచత్తురు – చావనేవలెన్
దాపరికంబదేల శపథం బొనరించితి – సర్వధర్మసం
స్థాపన చేయగా దగిన ధర్మజు డొక్కడె భూమినేలగా.

అర్జు:—కృష్ణా ! రాజ్యాధిపత్యము సంగతికాదు – క్షత్రియత్వపు

సంగతీ కాదు – ఈ అర్జునుడు మనుష్యమాత్రుడు కూడా కాలేదుకదా ... (దుఃఖంతో)

ఉ. అన్నలమాట కెప్పు డెదురాడని పార్థుడే చేతిమీదుగా
అన్ననుచంపె – ఇంతటి రహస్యము గుప్పున కుమ్మరించి– నా
కన్నులుదీసి – ఘోరనరకంబున చీకటి కుళ్ళు గుంటలో
నెన్నకదోసి, ఇట్లు జడిపించెడి పాతకమేమి చేసితిన్.

శ్రీకృ:— అర్జునా ! ఇహ నీవు యుద్ధం చేసేట్టు లేదు. ఈ విధంగా నీవు తలపోస్తూ కూచుంటే – నీవు చెడిపోవటమేకాదు, దేశ సౌభాగ్యాన్నికూడా చెడగొట్టినవాడవౌతావు.

తన రాచరికపు స్వార్థానికే దుర్యోధనుడింత రక్తపాతం తెచ్చిపెట్టాడు. అలాంటిస్వార్థం నీకు లేకుండా యుద్ధంలోకి దిగిందెందుకు–?

నీలాంటి నిస్వార్థులైన కర్మిష్ఠులను – శౌర్యవంతులైన క్షత్రియులను అభయంపొంది బాగుపడదామని ప్రజలంతా వచ్చి దూకారు– చచ్చిపోతున్నారు. ఇప్పుడు నీవేదో మహా అన్నను చంపేనేఅని కూలబడి గోడుగోడుమంటున్నావా–?

ఆ సంగతి ముందుగా తెలియదే అనుకో –

ఈ మూలిగే శవాలు ... కొట్టుకొనిపొయ్యే మొండాలూ నీకేమౌతారో కాస్తాలోచించు...వీళ్ళంతా నీకు...

ఉ. అన్నలుగారె చచ్చినమహాపురుషుల్ ప్రజలింతమంది – నీ
కన్నులముందు వీరల యఖండ బలివ్రత మొక్కలెక్కగా
గొన్నటులైనలేదు – అరికుంజరులై మరణించునప్పుడా
యన్నలుగారువీరు, నిజబంధు సతీసుతులందు సుంతయున్

యుద్ధంలో మరణిస్తే స్వర్గంవస్తుందని అంటారే.

ఇందుకే - ఈ నిస్వార్థసేవకే. నేనేదో పాతకం చేశాననిభయ పడుతున్నావు. ఇనాంటి మనస్సుకలవా ళ్లెప్పుడూ పాపం చెయ్యరు. ఈ అన్వేషణ నీలో సహజంగానే వుంది. అందుకే నీవు ధర్మమార్గాన పోతున్నావు - నీవు పాతకుడవుకాదు - కాలేవు - ఇక యీ కర్ణుడంటావా - .

ఉ. దానముచేత, సర్వబలిదానముచేత - కృతజ్ఞతాది వి
జ్ఞానముచేత - శౌర్యబలసంపద గల్గియు త్యాగశీలివై
మానవలోకమంతకును మార్గముచూపెడు వెల్గుకాగడా
వూని నభోమణిన్ గలసిపోయెను - దుఃఖపడంగ నేటికిన్.

అత్తయ్యా ! లెండి - అన్నీ తెలిసి మీరే మనస్సు పట్టలేకుంటే ఇతడి నోదార్చేవారెవ్వరు ?

కుంతి:—నాయనా ! ఒక్క వీడే అంటావెందుకు - అన్ని భారాలు వహించే వాడవు మాకు నీవొక్కడవే. కృష్ణయ్యా - నడి యుద్ధంలో వున్నాము. నిండా మునిగిపోయివున్నాం.

అర్జు:—(శ్రీకృష్ణుణ్ణి కావిలించుకొని) నేనీ దుఃఖం ఆపుకోలేను — మా అన్న "నన్ను క్షమించా" నని అంటేగాని ఓదార్పు గలుగదు కృష్ణా !

శ్రీకృ:—పిచ్చివాడా ! అది ఎలా సంభవిస్తుంది ? నీ దుఃఖం నీ పశ్చాత్తాపం కర్ణుడు చూట్టంలేదనుకుంటున్నావా -? చూస్తు న్నాడు. నిన్ను క్షమాపూర్వకంగా చూస్తున్నాడు. సందేహం వద్దు - నేను చెబుతున్నాగదా -

అర్జు:—నీకెట్లా తెలుస్తూంది? నీవుమాత్రం ఆయనను చూడగలవా?

శ్రీకృ:—(చిరునవ్వునవ్వి) అలాంటిపరీక్ష వేయటానికూడా నీవు

అధికారివి కావాలి. కర్ణుడు నిజంగా నిన్ను క్షమిస్తున్నాడు — తెలిసిందా —?

కుంతి:—నాయనా ! ఈ కనిపించే నీవే మాకు తెలుసు – అంతకన్నా మమ్మల్ని రక్షించేవాడివని తెలుసు – అంతే –! నీకు మా కర్ణయ్య కనిపిస్తున్నాడా—? చూసే చెప్తున్నావా కృష్ణయ్యా!

శ్రీకృ:—మీతో నేనబద్ధమాడుతానా —?

అర్జు:—(మోకరిల్లి) లేదు. నీవు అబద్ధమాడవు. కృష్ణా! వాసుదేవా! నీవు ఒక్కడివే దేవుడవు. నీకు తెలియనిదే లేదు. కనిపించని లోకాలనుకూడా అక్కడ కనిపించకుండానే పరిపాలిస్తున్నావు – అని తెలుస్తూంది.

నా అదృష్టంపండి – నా పుణ్యాలుపూసి – నన్ను గ్రహిస్తున్నావు. నీవు పరమదయాసముద్రడవు — కాకుంటే ఏలినవారు స్వయంగా నా గుర్రాలను కడిగి – దాణాలు దోసిళ్ళలో తినిపించి – ఎదురెండకు ఇంద్రధనుస్సులుపడే సౌందర్యం వాడిపోతున్నా — సారధ్యం చేస్తారా కృష్ణప్రభూ !

గాఢమైన బంధువ్యామోహం యేమాయాదేవివచ్చి అడుగడుక్కూ వేసిపోతున్నదో, ఈ చీకటి తెరలు తెముల్చుకోలేకుండా ఉన్నాను. నీ పాదసేవకు— నీకే దూరమైపోతానేమో కృష్ణా!

శ్రీకృ:— నన్నేం చేయమంటావు చెప్పు.

అర్జు:— మాఅన్నయ్యను నేనుచూడాలి. తమ్ముడా! నిన్నుక్షమించాను అనాలి.

కుంతి:— ఇంతమాత్రం వాడికోర్కె మన్నించు. పసివాడులా అడుగుతున్నాడు కృష్ణయ్యా.

శ్రీకృ:— అర్జునా! నావేపు బాగాచూడు— ఒక్కటేమాట — ఇది సవాల్ చేసి అడుగుతున్నాను. నిలుస్తావా?

అర్జు:— (చేతులు జోడించి) శలవిస్తే—

శ్రీకృ:— బాగా మనసు పట్టించుకో—

చావుపుట్టుకలు అనివార్యం— సామ్రాజ్యాలు దూదిపింజలవలె ఎగిరిపోతై— చక్రవర్తులు నశిస్తారు. సమాజం పరిణామ శీలమైంది. దానిమేరలూ, పొలిమేరలూ రక్షించేది ధర్మమొక్కటే— గుండెలో ప్రాణం, చేతిలోబాణం ఈ రెంటి మధ్య ద్వాపరం తిష్టవేసిఉంది.

అర్జు:— శలవియ్యాలె మరి. ఏం చెయ్యమంటారు నన్ను?

శ్రీకృ:— నిర్మోహంగా యుద్ధం చెయ్యాలి— నిష్కామంగా వెళ్ళిపోవాలి.

అర్జు:— ఫలితం—?

కృష్ణు:— అదినీకవసరంలేదు— ఆ సంగతి నిన్ను పుట్టించినవాడికి తెలుసు—

అర్జు:— క్షమించాలి— ఆ మనుష్యుడేమవుతాడు?

శ్రీకృ:— సార్వభౌముడేకావచ్చు— సేవకుడు కూడా కావచ్చును— ఇంతకన్నా అడగకు— అంతే— (ఆకాశం వైపుచూస్తూ) కర్ణా!

(ఆకాశంనుంచి భజనవలె రెండుసార్లు)

కైవల్యధామ— కల్యాణసీమ

లోకాభిరామ—శ్రీరామరామ

( అర్జునుడు, కుంతి ఆశ్చర్యంతో ఆకాశంలోకి చూస్తుంటారు )

శ్రీకృ:— కర్ణా! ఒక్కసారి నీవు నిజరూపంతో కనిపించాలి.

(కర్ణుడు కనిపిస్తాడు]

అర్జు:— (చేతులు జోడించి- గద్గదంతో, కన్నీళ్ళతో)

ఉ. అన్న- భవత్ప్రతాపమున కంజలిపట్టితినన్న- పాపినై
నిన్నువధించితన్న- కరుణింపగ వేడెదనన్న- అన్నవౌ
దన్నరహస్యమున్ తెలియకాడిన నిష్ఠురమైన మాటలే
నన్ను దహించెనన్న- మదినన్ను క్షమింపగదన్న ఇంతకున్.

శ్రీకృ:— "తమ్ముడా! నిన్ను క్షమించాను" అనాలి-

కర్ణు:— తమ్ముడా! నిన్ను క్షమించాను-

(మళ్ళీ-ఆకాశంలో)

కైవల్యధామ- కల్యాణసీమ
లోకాభిరామ - శ్రీరామరామ

(తెర)

---

శ్రీరామస్వరాజ్య ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.